EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: ***SHAPE SHIFTER***- GREEN APPLE, ***SPEED***-MANGO, ***FLIGHT***-ORANGE, ***GIANT***-WATERMELON, ***STRENGTH***- RASPBERRY, ***SHRINK***-LYCHEE, ***INVISIBLE***-PINEAPPLE, ***STRETCH***-MUSK MELON, ***FISSION***-BLACK CURRANT, ***FORCE FIELD***-GUAVA.

***RECAP:*** RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHEN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE DEKATRIX, ***A POWERFUL GADGET*** WITH 10 POWERS.




డా. మీన్ తన ల్యాబ్‌లో




(డా. మీన్ తన జాకెట్‌లోకి వెళ్ళారు మరియు మాయమయ్యారు) భయం కలిగించే పర్యలని చేయడం మొదలుపెట్టాడు. ప్రజలందరూ భయకంపితులయ్యారు ఎందుకంటే వారంతా వస్తువులు గాలిలో తేలుతుండటం చూస్తున్నారు.




రాము, శ్యాము మరియు ఏంజిల్‌లు సరదాగా విహరిస్తుండగా, ఉన్నంట్టుండి గట్టిగా అరుపులు, హాహా కారాలు విన్నారు.




వారు మాల్ బయటకి వచ్చి వస్తువులు గాలిలో కదలడం చూసారు, పిల్లలు ఏడుస్తున్నారు, ప్రజలు అరుస్తున్నారు.




ఆమె పవర్ గ్లాసెస్ వల్ల, డా. మీన్‌ని స్పష్టంగా ఆమె చూడగలిగింది.




రామ్ మరియు శ్యామ్‌పవర్ ఆఫ్ ఇన్‌విజిబిలిటీని అన్‌లాక్ చేయడానికి పైనాపిల్ ఫ్లేవర్ గల పాపిన్స్‌ని తిన్నారు



రామ్ మరియు శ్యామ్ తెల్లగా కనిపించారు (ఇన్‌విజిబుల్ మోడ్‌లో) మరియు ఏంజిల్ కలర్‌లో




వారు డా. మీన్‌ని అనుసరించారు మరియు కలర్ గన్‌తో షూట్ చేసారు. అతను ఇప్పుడు అందరికీ కనబడుతున్నాడు.



చుట్టూ జనాలతో పాటుగా ఈ ముగ్గురూ కూడా చేసి, కింద పడేసి కొట్టారు.



# యువ విజేతలు

## వరుణ్ రిష్బుద్

పదహారేళ్ల విభాగంలో థానె జిల్లా ఛాంపియన్ బాస్కెట్‌బాల్ జట్టు సభ్యుడు వరుణ్ రిష్బుద్ థానెలోని సరస్వతీ విద్యా మందిర్ పాఠశాల విద్యార్థి. పదవ తరగతి చదువుతున్న వరుణ్‌కి అదే పెద్ద ఒత్తిడి కలిగిస్తున్నప్పటికీ, తల్లిదండ్రులు, కోచ్ మంజూషా ఆప్టే ఇచ్చిన అద్భుతమైన ప్రోత్సాహంతో ఇప్పటికీ రోజుకు రెండు గంటలు శిక్షణ పొందుతూ, ఆటకు, చదువుకు మధ్య సమతూకం పాటిస్తున్నాడు.

చురుకుగా డ్రిబ్లింగ్ చేసే ఇతడి నైపుణ్యం, ఖచ్చితత్వం అతడిని జట్టులో ఆల్‌రౌండర్‌గా మార్చింది.

బాస్కెట్‌బాల్‌తోపాటు ఇతడు క్రికెట్, టెన్నిస్‌నీ చూస్తుంటాడు. అహంభావం లేని సచిన్ టెండూల్కర్, ఆడమ్ గిల్‌క్రిస్ట్ క్రికెట్‌లో హుందాతనంతో మెలిగే గొప్పమనుషులని వరుణ్ అభిప్రాయం. బాస్కెట్‌బాల్ ఆడుతున్నప్పుడు ఇతడు ఈ విషయాన్ని మర్చిపోకుండా గుర్తుపెట్టుకుంటాడు.

పదవ తరగతి బోర్డు పరీక్షలకు కూడా ఇతడు బాగానే సిద్ధమవుతున్నాడు. భవిష్యత్తులో విజ్ఞాన శాస్త్రాన్ని అభిమాన విషయంగా తీసుకోవాలని ఇతడి ఆశ. అలాగే బాస్కెట్‌బాల్‌లో కీలకమైన పాత్ర నిర్వహించాలనేది తన తదుపరి స్వప్నం. అమెరికా బాస్కెట్‌బాల్ దిగ్గజం కరీమ్ అబ్దుల్ జబ్బార్ చెప్పిన విషయాన్ని వరుణ్ ప్రగాఢంగా విశ్వసిస్తున్నాడు. "ఒక వ్యక్తి కీలకపాత్ర పోషించి ఉండవచ్చు. కాని ఒక మనిషి మొత్తం జట్టును మలచలేడు."



**విజయాలు:**

- రాష్ట్ర పదహారేళ్లలోపు విజేత జట్టు సభ్యుడు.
- టిఎమ్‌సి నిర్వహించిన థానె జిల్లా ఛాంపియన్‌షిప్ పోటీల్లో రాష్ట్ర పదహారేళ్ల లోపు విజేత జట్టు సభ్యుడు.
- ఎస్ఎఐ నిర్వహించిన థానె జిల్లా ఛాంపియన్‌షిప్ పోటీల్లో రాష్ట్ర పదహారేళ్ల లోపు విజేత జట్టు సభ్యుడు.

మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో కాని ఎవరినయినా ఉదయతారగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Swati Enclave,
Door No 5 & 6,
Amman koil st,
vadapalani, chennai-26
(or)
online@chandamama.com

# ఈ సంచికలో ...



చందమామ Volume-2 May 2011 Issue-05













**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.



T

ప్రియ మిత్రులారా!

ముందుగా జపాన్‌లో భూకంపం, సునామీ బారిన పడిన వారిని స్మరించుకుందాం. సునామీ విధ్వంసక చిత్రాలను చూసి మనందరం చలించిపోయాము. జపాన్ ఈ పెనునష్టాన్ని హుందాగా స్వీకరించింది. జపనీయులు తమ తోటి దేశస్థులకు సహాయం అందించిన తీరు మనల్ని ఆశ్చర్యంలో ముంచెత్తుతుంది. దీన్నుంచి నేర్చుకోవలసిన గుణపాఠాలను మననం చేసుకుంటూనే, ఎంతకాలంగానో ఎదురుచూస్తున్న వేసవి విరామంపై చూపు సారిద్దాము.

వేసవి సెలవుల్లో మీరు కోరుకున్న ప్రాంతాలను సందర్శించవచ్చు, బంధువులను కలవవచ్చు. స్నేహితులతో ఆడుకోవచ్చు, ఏదైనా కొత్త అలవాటు నేర్చుకోవచ్చు. అవసర మైన వారికి మీరు సహాయం చేయడం మీ సెలవులకు మరింత వన్నె తెస్తుంది. వారానికి ఒకసారి అంధుల పాఠశాలకు వెళ్లడం మంచి ఆలోచన. చందమామ పత్రికలోని చక్కటి కథలను వారికి చదివి వినిపించండి. ఇది మీకూ, అంధులైన పిల్లలకు మంచి అనుభూతిని అందిస్తుంది. మీ తోటలో లేదా మీ ప్రాంతంలో మొక్కలు నాటండి. తద్వారా మీరు పర్యావర ణానికి సహకరించిన వారవుతారు. మీరు నాటి పెంచి పెద్ద చేసిన చెట్టు ఫలాలను అందిస్తే అంతకు మించిన సంతోషం మీకేముంటుంది!

వర్షపు నీటిని నిలవ చేయడానికి తగిన ఏర్పాట్లను చేయండి. వేసవికి ముందుగా వచ్చే వర్షపు నీటిని భద్రపర్చటం మంచిది.

ఈ నెలలోనే మనం అంతర్జాతీయ కార్మిక దినం, మాతృదినోత్సవం, బుద్ధ పౌర్ణమిలను జరుపుకుంటాము. మనకోసం శ్రమిస్తున్న వారిపట్ల కృతజ్ఞత తెలుపవలసి ఉంది. మన తల్లులు మన పట్ల ప్రేమాభిమానాలు చూపిస్తున్నందుకు కోసం వారిని ప్రత్యేకంగా గౌరవించాలి. బుద్ధుడి బోధనలు ఈ ఆధునిక కాలంలో మరింత సందర్భోచితంగా ఉంటు న్నాయి. అతడి జీవితం, బోధనలను అధ్యయనం చేస్తే అది మన జీవితాలను తప్పక వెలిగిస్తుంది. మీ సెలవుదినాలను మీరు ఎలా గడిపారో తెలుసుకోవడానికి కుతూహలపడు తున్నాము. మీరు పంపే ఉత్తరాలలో ఆసక్తికరమైన వాటిని ప్రచురిస్తాము. మీ సెలవులను హాయిగా ఆస్వాదించండి.

– సంపాదకులు




మే 2011 ₹20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar
**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor :**
Patricia Pandian
**Content Head - Online :**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar
**Artist :**
Venki
**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar
**Production In-charge :**
Prashant Pawar
**Circulation:**
circulation@chandamama.com
**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej
**Sales Officer - Circulation :**
K. Ravishankar
**Advertisement :**
sales@chandamama.com
**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828
**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh. Editor :- Prashant Sharad Mulekar

T మే 2011



# పాఠకుల లేఖలు



చందమామతో నా అనుబంధం 62 సంవత్సరాలు. చందమామతో సరిపోలిన కథల పుస్తకం మరొకటి నా కంటికి కనబడలేదు. ఎన్నో కథల పుస్తకాలు వచ్చాయి. వస్తున్నాయి. ఇవేవీ చందమామతో సరితూగలేవు. చందమామను ప్రతి నెలా కొని రోజుకు రెండు కథల చొప్పున చదివి తృప్తి చెందుతుంటాను. అన్ని కథలూ ఒకేసారి చదవలేను. ఇప్పుడు నా వయస్సు 72 సంవత్సరాలు. నేను చదివాక నా మనవరాళ్ళు వాటిని చదివి భద్రంగా దాస్తుంటారు. మనసు బాగు లేకుంటే పాత చందమామ కథలు చదివి, నేను ప్రశాంతత పొందుతాను. పత్రిక సైజును తగ్గించకండి. చందమామ నా ప్రాణం.

– హెచ్. అబ్దుల్ మజీద్, చిత్తూరు

పట్టు వస్త్ర ధారణతో ఇన్నాళ్లూ పవిత్రంగా ఉన్న చందమామ, ఫిబ్రవరి సంచికలో పిట్టలదొరలా మారిపోయింది. ప్యాంటు షర్టూ లాంటి వస్త్రధారణ గల బొమ్మలతో, చందమామ కురిపించే చల్లని వెన్నెల కరిగిపోయి, అభిమానుల కళ్లల్లో కన్నీరు మిగిలింది. చందమామ కున్న సంప్రదాయకళ పోయి ఎబ్బెట్టుగా మారింది. 'వ్యాపారంలో కిటుకు,' 'సొంత ఇల్లు,' 'ఇంటింటికో పువ్వు' కథలకు వేసిన చిత్రాలు పూర్తిగా అభ్యంతరకరం. ఇలాంటి కథలూ చిత్రాలూ పరిహరించండి. తగ్గించిన సైజును పెంచారని సంతోషిస్తుంటే, మరోవైపు పేపర్ క్వాలిటీని తగ్గించారు. ఇదేం చెలగాటం! ఎన్నాళ్లు పాఠకుల సహనం మీద ఈ క్రూర పరిహాసం?

– కె. గౌరీశంకర్, హైదరాబాద్

చందమామకు మేము నిత్య పాఠకులం. కథలు చక్కగాను, జ్ఞానదాయికంగాను ఉన్నాయి కాని చిన్నలోటు కనిపిస్తోంది. ఇప్పుడు పత్రికలో జంతువుల కథలు, సాంఘిక కథలు లేవు. ప్రతి ఒక్కరూ వీటిని ఆసక్తిగా చదువుతారు. చందమామ చదివితే రోజంతా పడిన కష్టం పోయి తాజాగా ఉన్నట్లుంటుంది. చందమామ టీమ్‌కి పరిపరి వందనాలు.

– సురేంద్ర బిందాల్, చంబా, హిమాచల్‌ప్రదేశ్

# పండితుడి సలహా

పూర్వం కన్యాకుబ్జంలో, పుష్యమిత్రుడనే మహాకవి ఉండేవాడు, ఆయన నిరుపేద, ఆయన కవిత్వం చదివిన శ్రీభట్టు అనే పండితుడు, 'పుష్యమిత్రా! ఇంత మంచి కవిత్వం రాజుగారు వింటే, నీకు పేదరికం లేకుండా చేస్తాడు. వెంటనే వెళ్లి రాజుగారి దర్శనం చేసుకో,' అని సలహా ఇచ్చాడు.

పుష్యమిత్రుడు, రాజదర్శనం చేసుకుని తను రాసిన కవిత్వం వినిపించాడు. రాజు చాలా సంతోషించి, పుష్యమిత్రుడికి మంచి బహుమానం ఇవ్వడమే కాకుండా ఆయనను తన ఆస్థానంలో చేర్చుకున్నాడు.

కొంత కాలం తర్వాత పుష్యమిత్రుడు, శ్రీభట్టును కలుసుకుని, 'నేనిప్పుడు రాస్తున్న కవిత్వం, రాజాస్థానంలో నేను చేరకముందు రాసిన కవిత్వపు స్థాయిలో లేదని, చాలా మంది అంటున్నారు. నాకు కూడా అది నిజమేననిపిస్తున్నది. కారణం ఏమై ఉంటుందంటారు?' అని అడిగాడు.

అందుకు శ్రీభట్టు, 'ఆ రోజున నీ కవిత్వాన్ని దృష్టిలో పెట్టుకుని రాజుగారు బహుమానం ఇస్తే, ఇప్పుడు నువ్వు రాజుగారు ఇవ్వబోయే బహుమానాన్ని దృష్టిలో పెట్టుకుని కవిత్వం రాస్తున్నావు. ఈ ధోరణి మార్చుకుంటే, నువ్వు ఈనాడూ మంచి కవిత్వం రాయగలవు,' అని చెప్పాడు.

పండితుడన్న మాటల్లోని అంతరార్థం గ్రహించిన పుష్యమిత్రుడు, రాజుగారు ఎలాంటి బహుమానం ఇవ్వబోతారన్న ఆలోచన మాని, తన పూర్వ పద్ధతిలో కవిత్వం రాస్తూ, మంచి కవిగా ప్రసిద్ధుడయ్యాడు.

– బి. రఘురామరాజు



Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)**



**Chandamama!**

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
Go to www.chandamamashop.com & subscribe Now!!



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..........................................................................................

Date of Birth: .................................. Sex :......................................

Address: ......................................................................................

......................................................................................................

......................................................................................................

...................................................... City: ........................................

State:.......................................... Pin:..............................................

Telephone:....................................................................................

Mobile:..........................................................................................

Email:............................................................................................

Subscription Number (for renewals):............................................

Gift Subscription to the following address:

......................................................................................................

......................................................................................................

......................................................................................................

......................................................................................................

Enclosed Cheque/DD* for Rupees................................................

Cheque/DD No ............................................................................

favouring Chandamama India Ltd on..........................................

.......................................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| **You Save** | | **Rs. 60** | **Rs. 135** | **Rs. 240** | **Rs. 375** |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| **You Save** | | **Rs. 50** | **Rs. 110** | **Rs. 190** | **Rs. 300** |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| **You Save** | | **Rs. 35** | **Rs. 80** | **Rs. 145** | **Rs. 225** |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# అతి సర్వత్ర వర్జయేత్!

ఒక ఊళ్ళో దానయ్య, వీరయ్య అనే ఇద్దరు రైతులు ఉండేవారు. దానయ్య ప్రతి విషయం లోనూ వీరయ్యను సరిచేస్తూ ఉండేవాడు. మొదట్లో వీరయ్య సంతోషించేవాడు. పొరబాటు సరిదిద్దుకుని, దానయ్యకు ధన్యవాదాలు తెలిపేవాడు. దాంతో దానయ్యకు తను వీరయ్యకన్నా తెలివైనవాడిననీ, తన సలహా లేనిదే వీరయ్య ఏ పనీ చెయ్యలేడనీ నమ్మకం ఏర్పడింది. రాను రానూ వీరయ్యకు దానయ్యతో స్నేహంగా ఉండడం కష్టమనిపించ సాగింది. ఏం చెయ్యాలో పాలుపోక గ్రామ పెద్దను సలహా అడిగాడు.

గ్రామ పెద్ద మర్నాడు దానయ్యను తన దగ్గరికి రమ్మని కబురు పంపాడు. కుశల ప్రశ్నలు అడిగిన తర్వాత, 'వీరయ్య పొలంలో కలుపు సమస్య ఉందని తెలిసింది. ఈ రోజు నుంచీ నువ్వు క్రమం తప్పకుండా అతని పొలంలో కలుపు తియ్యాలి!' అని ఆజ్ఞాపించాడు.

తన నైపుణ్యాన్ని గ్రామాధికారి కూడా గమనించాడని సంబరపడ్డాడు దానయ్య. కొన్ని రోజులు ఉత్సాహంగా వీరయ్య పొలంలో పని చేశాడు. కానీ క్రమంగా అతనికి ఈపని విసు గనిపించ సాగింది. పైగా తన స్వంత పొలంలో కలుపు తీసేపని అటకెక్కింది. వెళ్ళి గ్రామాధి కారితో మొర పెట్టుకున్నాడు. అప్పుడు గ్రామాధికారి, 'మరి వీరయ్య పొలంలో కలుపు తియ్యకపోతే అతనికి నష్టం కదా?' అని అడిగాడు. 'అయ్యా, అతని పొలం బాధ్యత అతనిది కదా? అతని పొలం శుభ్రం చేస్తుంటే నా పొలంలో కలుపు పెరిగిపోతోంది!' అన్నాడు దానయ్య.

అప్పుడు గ్రామాధికారి, 'దానయ్యా, నువ్వు అనుక్షణం వీరయ్యను కనిపెట్టుకుని ఉంటావనీ, అతని పొరపాట్లన్నీ సరిదిద్దుతావనీ విన్నాను. అందుకే అతని పొలం బాధ్యత నీకు అప్పగించాను. కానీ నా కళ్ళు తెరిపించావు. ఎవరి పొలంలో కలుపు వారే తీసుకోవాలి. ఎవరి తప్పులు వారే సరిదిద్దుకోవాలి. ఏమంటావు?' అన్నాడు. జ్ఞానోదయం అయిన దానయ్య అప్పట్నుంచీ వీరయ్యకు అతిగా సలహాలు ఇవ్వడం మానుకున్నాడు. – గోదావరి లలిత



# చందమామతో నా జ్ఞాపకాలు

చిన్న సైజులో ఉండే చందమామను మొట్టమొదటి సారిగా మా బంధువుల ఇంట్లో చూశాను. అప్పుడు నా వయస్సు 8 లేదా 9 ఏళ్లు. చూడటం అదే మొదటిసారి అయినప్పటికీ చందమామ నా మనస్సుపై బలంగా ముద్రవేసింది.

పత్రిక నా చేతిలోకి రాగానే మొదట నేను చేసే పనేమిటంటే దాంట్లోని కథలన్నింటినీ మా నాన్నకు చదివి వినిపించడమే. చందమామ ద్వారానే తొలి సారిగా నేను మన మతం, యుద్ధ తంత్రం, కృతజ్ఞత, కనికరం, మన దేశం వంటి అంశాలను గురించి తెలుసుకున్నాను.

చందమామ భాష విశ్వజనీనమైనది, దేశంలోని అన్ని భాషలవారు చదవగల కథలకు చందమామ కాణాచి. ఆరు దశాబ్దాల పైబడిన తర్వాత ఈనాటికీ చందమామ భాష ఒకేలా కొనసాగుతూండటం ఆశ్చర్యకరం. చందమామ అంటేనే నాకు బేతాళ కథలు గుర్తుకొస్తాయి.



Name: Debashish Ghosh
Occupation: Government Service, West Bengal.

ఒకసారి నేను చందమామ కార్యాలయానికి ఉత్తరం రాశాను. కొద్ది రోజుల తర్వాత, బి. విశ్వనాథరెడ్డి గారి సంతకంతో ఆకర్షణీయమైన పోస్ట్ కార్డు అందుకున్నాను. నా ఆనందానికి హద్దే లేదు. ఈనాటికీ దాన్ని నేను పదిలంగా దాచుకుంటున్నాను.

రోజులు గతిస్తున్నాయి. అనేకపరిణామాల మధ్య చందమామ తన విశిష్టతను కొనసాగిస్తూంది. నిర్మల గంగానదిలా అది పాఠకుల హృదయాలను తన కథలతో రంజింపజేస్తూనే ఉంది.

ఈ సాంప్రదాయం చెక్కుచెదరకుండా కొనసాగుతుందని ఆశిస్తున్నాను. ఈ రోజుకీ నేను చందమామను క్రమం తప్పకుండా చదువుతూనే ఉన్నాను. ప్రస్తుతం పదో తరగతి చదువుతున్న మా అబ్బాయి కూడా చందమామను నాలాగే చదువుతుంటాడు.

మన ఘనమైన దేశం గురించి తెలుసుకోవాలంటే చందమామ ఒక చక్కటి మాధ్యమమని నా నమ్మకం. ఎందుకంటే ఇది అన్ని వయసుల వారినీ ఆకర్షిస్తోంది. హృదయపూర్వకంగా మిమ్మల్ని అభినందిస్తున్నాను. సమస్త భారతీయుల మనస్సులలో చందమామ ఉజ్వల నిధిలా ప్రకాశించాలని మనసారా ఆశిస్తున్నాను.

చందమామ పత్రికతో మీ చిన్ననాటి అనుబంధం గురించి పాఠకులతో పంచుకుని, చందమామలో ప్రచురించాలనుకుంటున్నారా? దయచేసి మీ జ్ఞాపకాలు మాకు పంపండి. online@chandamama.com

(or)

Chandamama India Ltd; No:2 Ground Floor, Swathi Enclave,
Door No 5 & 6, Amman koil street, Vadapalani, Chennai-600026.
Phone: 044-43992828

## బేతాళ కథలు

# సంకల్పసిద్ధి

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా! నీ సాహసం, చిత్తశుద్ధి నిజంగా ప్రశంసనీయమైనవి. అయితే ఇతరుల సహాయంతో సులభంగా పని ముగించడానికి బదులు కఠినతరమైన మార్గాన్ని ఎన్నుకుంటున్నావేమోనని నా సందేహం. చాలామంది తమకు సహాయం చేసేవారు తర్వాత తమపై పెత్తనం చెలాయిస్తారేమోననే భయంతో ఎవరి సాయం కోరకుండానే సమస్యలను తమ నెత్తినే వేసుకుంటారు. ఈ సందర్భంగా, ఒక యోగి అద్భుత శక్తుల సహాయం తీసుకుని తక్షణం సమస్యల నుంచి బయటపడే అవకాశం ఉన్నప్పటికీ, తన సమస్యలను తానే పరిష్కరించాలని నిర్ణయించుకున్న నాగధీరుడనే మహారాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

సుధీర రాజ్యాన్ని నాగధీరుడు అనే రాజు పరిపాలించేవాడు. నాగధీరుడు మంచి




వీరుడు. ప్రజాక్షేమం కాంక్షించే రాజు. అందుకే అతని పాలనలో ప్రజలందరూ సుఖశాంతులతో అలరారేవారు.

ఒకపర్యాయం సుధీరరాజ్యంలో వర్షాలు సకాలంలో కురియక క్షామం ఏర్పడింది. అందుకు చింతించిన నాగధీరుడు కోశాగారం నుంచి ధనం వెలికితీసి పొరుగు రాజ్యాలనుంచి తిండిగింజలు తెప్పించాడు. అయితే మరుసటి ఏడాది కూడా వర్షాలు కురవకపోవడంతో క్షామం తీవ్రమయింది.

కోశాగారం కూడా ఖాళీ అవడంతో నాగధీరుడు మథనపడసాగాడు. అంతలో అతనికి అనారోగ్య సమస్య తలెత్తింది. రాచపుండు వలన అతని ఆరోగ్యం క్షీణించసాగింది. రాజవైద్యులు ఎంత ప్రయత్నించినా అతనికి స్వస్థత చేకూరలేదు.

అదే అదునుగా మహీపురి రాజు క్రాంతిసింహుడు, సుధీరరాజ్యం మీద దాడి చేయాలని కుట్ర చేశాడు. ఇరురాజ్యాల మధ్య తరతరాల శతృత్వం ఉంది. అయితే నాగధీరుడి వీరత్వం తెలిసిన క్రాంతిసింహుడు అతని రాజ్యంమీద దాడి చేయడానికి సాహసించలేదు. అయితే ఇప్పటి పరిస్థితుల దృష్ట్యా అతను సైన్యాన్ని సమాయత్తపరిచి సుధీర రాజ్యం మీద యుద్ధం ప్రకటించాలని యోచించాడు.

చారుల ద్వారా ఆ విషయం తెలుసుకున్న నాగధీరుడు చక్రవ్యూహంలో చిక్కుకున్నట్లు అర్థం చేసుకున్నాడు. క్షామం వలన ఖజానా ఖాళీ అయింది. రాచపుండు వలన తాను ముందుండి సైనికులను నడిపించలేడు. అతనికేం చేయాలో పాలుపోలేదు.

అంతలో మంత్రి ధర్మశీలుడు, నాగధీరుణ్ణి కలిసి, 'రాజా! మన రాజ్యంలో సువేతుడు అనే యోగీశ్వరుడు బస చేశాడు. అతను మహిమాన్వితుడని తెలిసింది. అతడిని రాజమందిరానికి రప్పించి తరుణోపాయం సెలవీయమని కోరుదాము' అని సలహా ఇచ్చాడు.

మంత్రి సలహా విన్న నాగధీరుడు, 'మంత్రివర్యా! అటువంటి మహానుభావులు తమంతట తాము మనవద్దకు వస్తే స్వాగతించాలే గాని వారిని మనదగ్గరకు రప్పించడం తగదు. అందుకని మనమే స్వయంగా వారి సమక్షానికి బయలుదేరుదాము,' అని చెప్పి, మంత్రితో కలిసి వెళ్ళి ఒక సామాన్యుడిగా సువేతుణ్ణి కలిశాడు.

మహారాజు స్వయంగా తన సమక్షానికి రావడంతో అతని వినయశీలత సువేతుడికి

సంతృప్తినిచ్చింది. మహారాజు చెప్పకుండానే అతని సమస్య, సువేతుడు యోగదృష్టితో తెలుసుకున్నాడు. అతడు, నాగధీరుడితో, 'రాజా! నేను నీకు మూడు మంత్రాలు ఉపదేశిస్తాను. ప్రతి రాత్రి నిదురించే ముందు ఒక మంత్రం పఠించు. నిద్రలో నీకో స్వప్నం సాక్షాత్కరిస్తుంది. అలా మూడు రాత్రులు గడిచాక నన్ను కలిసి నీ స్వప్న వృత్తాంతాలు వివరించు,' అని చెప్పి ఆ మూడు మంత్రాలు ఉపదేశించాడు.

మహారాజు అంతఃపురం చేరాడు. ఆ రాత్రి సువేతుడు ఉపదేశించిన ఒక మంత్రం పఠించి నిదురించాడు. అంతట అతనికో స్వప్నం వచ్చింది. అందులో అనారోగ్యంతో బాధపడుతున్న నాగధీరుడు, సైన్యాన్ని ముందుకు నడిపించి క్రాంతిసింహుణ్ణి ఎదిరించాడు. ఆ యుద్ధంలో నాగధీరుడు ఘోరంగా ఓడిపోయాడు. క్రాంతిసింహుడు సింహాసనం స్వాధీనం చేసుకుని ఆ రెండు రాజ్యాలను ఏకం చేశాడు. తద్వారా సుధీర రాజ్యంలో క్షామం మాయమైంది.

రెండోరోజు నాగధీరుడు మరో మంత్రం పఠించి నిదురించాడు. అప్పుడు అతనికి మరోస్వప్నం వచ్చింది. అందులో రాజవైద్యులు వింధ్యగిరి పర్వతాలకు వెళ్లి అరుదుగా దొరికే ఆరోగ్యహిత అనే మూలిక సంపాదించి తెచ్చి రాజుకు వైద్యం చేశారు. అతనికి స్వస్థత చేకూరింది. నాగధీరుడు యుద్ధం చేయగలిగి ఉండి కూడా రాజ్య ఆర్థిక పరిస్థితి బాగోనందున, క్రాంతి సింహుడితో సంధి కుదుర్చుకున్నాడు. అందువలన యుద్ధ భయం తప్పింది. అయితే రాజ్యంలోని క్షామం మాత్రం తొలిగి పోలేదు.

మూడోరాత్రి నాగధీరుడు మూడోమంత్రం పఠించి నిద్రించాడు. ఎప్పటిలానే అతనికొక స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో మహారాజు





యోగీశ్వరుడైన సువేతుడి దివ్యచరణాలు తాకి శరణు కోరాడు. సువేతుడు తన యోగ శక్తితో మహారాజును ఆరోగ్యవంతుడిని చేశాడు. తదుపరి క్రాంతిసింహుడి సైన్యం మధ్య అగ్నిజ్వాలలు సృష్టించి వాళ్లను భయ భ్రాంతులను చేసి, యుద్ధభూమి నుంచి పారద్రోలాడు. సువేతుడు ఆకాశం వంక దృష్టి సారించగానే మెరుపులు మెరిసి కుంభవృష్టి కురిసింది. అంతటితో సుధీర రాజ్యంలోని క్షామం తొలిగిపోయింది.

ఆ మరునాడు నాగధీరుడు, సువేతుడిని కలిసి తనకు వచ్చిన మూడు స్వప్న వృత్తాం తాలు వివరించాడు. సావధానంగా విన్న సువేతుడు, 'రాజా! ఈ మూడు స్వప్నాలలో ఒక దాన్ని ఎంపిక చేసుకో! నీకో మంత్రం ఉపదేశిస్తాను. ఆ మంత్రశక్తితో నీవు కోరిన స్వప్నం సాకారం అవుతుంది. నీ సమస్యలు తీరుతాయి,' అని ధైర్యం చెప్పాడు. మరోసారి తన స్వప్నాలు మననం చేసుకున్న నాగ ధీరుడు, కొద్ది క్షణాలు ఆలోచించి 'మహి మాన్వితా! మీరు చేసిన సహాయం మరువ రానిది, మంత్రం కంటే సంకల్పం గొప్పది. నా సంకల్పం సిద్ధించాలని దీవించండి,' అని కోరాడు.

సువేతుడు సంతృప్తిగా తల పంకించి 'తథాస్తు' అని దీవించాడు.

అంతఃపురం చేరిన మహారాజు, రాజ వైద్యులను వింధ్యగిరులకు పంపి ఆరోగ్య హిత మూలిక తెప్పించి చికిత్స చేయించుకు న్నాడు. రాచపుండు తగ్గి స్వస్థత చేకూరింది. తదుపరి మిత్రరాజ్యాల ఆర్థిక సహాయంతో, తనపై యుద్ధం ప్రకటించిన క్రాంతిసింహు డిని సమర్థవంతంగా ఎదుర్కొని ఓడించాడు. తరవాత రెండు రాజ్యాలను ఒక్కటి చేసి, మహీపురి రాజ్యంలోని సువర్ణముఖి నీటిని కాలువలద్వారా సుధీరరాజ్యానికి రప్పిం చాడు. అంతటితో క్షామం తొలిగింది. ప్రజ లందరూ నాగధీరుడిని ఎంతగానో కొనియా డారు.

అంతవరకూ కథ చెప్పిన బేతాళుడు, 'రాజా! నాగధీరుడు తనకొచ్చిన మూడో స్వప్నాన్ని మంత్రశక్తితో సాకారం చేసుకుంటే అతని కొచ్చిన సమస్యలన్నీ అవలీలగా పరి ష్కారమయ్యేవి. అయితే నాగధీరుడు మంత్ర శక్తిని కాదని, సంకల్ప సిద్ధిని కోరుకుని తన సమస్యలను క్లిష్టమైన రీతిలో ఎందుకు పరి ష్కరించుకున్నాడు? ఇది అతని అవివేకానికి నిదర్శనం కాదా? రాజవైద్యులను వింధ్య గిరులకు పంపడం. రక్తపాతంతో రాజ్యం

జయించడం తన రాజదర్పం చూడడానికి. ధీరత్వం ప్రదర్శించడానికే అన్నట్లు ఉంది. సువేతుణ్ణి శరణు కోరకపోవడం, అతని స్థానన్న మంత్రశక్తిని కాదని సంకల్పసిద్ధిని కోరడం, భవిష్యత్తులో యోగి తనను శాసించ గలడన్న భీతితోనా? అలాగే సువేతుడు ఏ సహాయం చేయకపోయినా మీ సహాయం మరువరానిది అంటూ స్తుతించడం అతని మెప్పు పొందడానికా? సరైన సమాధానం చెప్పు, సమాధానం తెలిసీ చెప్పకపోయావో నీ తల వేయి ముక్కలవుతుంది,' అని అన్నాడు.

అందుకు విక్రమార్కుడు, 'బేతాళా, సువేతుడు ప్రసాదించే మంత్రశక్తితో నాగ ధీరుడు తన సమస్యలు పరిష్కరించుకుంటే ఒక రాజుగా, ఒక వీరుడిగా అతను విఫల మయినట్లే! నిజమైన వీరుడు పోరాటంలోనే తాను కోరుకున్నది సాధిస్తాడు. అలాగే నిజ మైన రాజు ప్రకృతి విపత్తులను సైతం తన శక్తియుక్తులతోనే జయించాలనుకుంటాడు. అతీత శక్తులను జయించడానికి మంత్ర శక్తులు అవసరమేమో గాని, సాధారణ విష యాలకు సంకల్పసిద్ధి మాత్రమే సరైన దారి. నాగధీరుడు వివేకవంతుడు కాబట్టే ఆ దారి ఎంచుకున్నాడు.

వింధ్యగిరుల్లో దొరికే ఆరోగ్యహిత మూలిక గురించి, క్రాంతి సింహుడిని ఓడించి రెండు రాజ్యాలు ఏకం చేస్తే తన రాజ్యంలోని క్షామం తొలగిపోగలదన్న సత్యాలను నాగధీరుడు తన స్వప్న వృత్తాంతాలను బట్టి తెలుసుకో గలిగాడు. ఆ కలలు రావడానికి కారకుడైన సువేతుడిని అందుకే స్తుతించాడు. అంతే గాని అతని మెప్పు పొందడానికి మాత్రం కాదు.

ఇకపోతే సర్వసంగ పరిత్యాగి అయిన సువేతుడు తనను శాసించగలడన్న భీతి వివేకవంతుడైన మహారాజుకు ఎప్పటికీ కలగదు,' అని సమాధానమిచ్చాడు.

విక్రమార్కుడి నుంచి సరైన సమాధానం రావడంతో బేతాళుడు మళ్లీ చెట్టెక్కాడు.

– కల్పితం

*[ ఆధారం : ఎస్.శివనాగేశ్వరరావు]*



# నీలాంటివాడే!

రామేశం, కామేశం ఇరుగుపొరుగునేవున్న భూస్వాములు. ఊళ్ళో అంతా రామేశాన్ని చమత్కారానికి మారుపేరని అంటారు. ఆ రామేశాన్ని ఆటపట్టించి, తను అతణ్ణి మించిన చమత్కారి అనిపించుకోవాలని కామేశం మనసు. ఐతే, అందుకు ప్రయత్నించినప్పుడల్లా, భంగపడడమే రివాజయింది.

ఒకఏడాది ఆ ఊరి రామాలయంలో, ఊరి పెద్దలందరూ సమావేశమై, శ్రీరామనవమికి ఏర్పాట్ల గురించి చర్చిస్తున్నారు. రామేశం చేసిన సూచనలన్నింటినీ, భీమేశం అనే పెద్ద మనిషి కాదంటున్నాడు. రామేశం సూచనలివ్వడం మానేశాడు. అక్కడే వున్న కామేశం బాధ నటిస్తూ, ''రామేశం! సూచనలివ్వడం మానేశావేం?'' అన్నాడు.

''అనువుకాని చోట అధికులమనరాదు,'' అన్నాడు రామేశం.

''నీ మాట నెగ్గడం లేదని కోపమొచ్చిందా?'' అన్నాడు కామేశం, ఆయన్ను రెచ్చగొట్టాలని.

''పేదవాడి కోపం పెదవికి చేటు,'' అన్నాడు రామేశం.

''అర్థమైంది. నీకు పెద్దరికం లేదని, సీతారాముల కల్యాణానిక్కూడా రావా ఏమిటి?'' అన్నాడు కామేశం. ''దేవుడి పెళ్ళికి అందరూ పెద్దలే కదా!'' అన్నాడు రామేశం.

''అందరూ పెద్దలే అంటున్నావు! మరి అందరూ అందల మెక్కేవాళ్ళయితే, మోసే వాళ్ళెవరుట?'' అంటూ కామేశం, తనూ ఓ సామెత ప్రయోగించి మెప్పుకోసం అందరి వంకా చూశాడు. రామేశం చటుక్కున, ''ఆ, ఎవడో నీలాంటివాడు దొరక్కపోడు!'' అన్నాడు. అక్కడున్న వారంతా ఘొల్లుమన్నారు. కామేశం ముఖం వెలవెలపోయింది.

– శ్రీ రామకమల్





# తగిన గురువు

పూర్వం భార్గవుడనే గ్రామాధికారికి లేక లేక పుట్టిన ఒకే ఒక కొడుకు దీపకుడు. అల్లారుముద్దుగా పెరుగుతున్న కొడుక్కి మంచి విద్యాబుద్ధులు చెప్పించి ప్రవీణుడిగా చేయాలని తండ్రి కోరిక. సమర్థుడైన గురువు ఎక్కడ దొరుకుతాడా అని ఆలోచనలో పడ్డాడు భార్గవుడు.

ఎందుకంటే దీపకుడు చాలా చురుకైనవాడు, తెలివైనవాడు. ఏ విషయమైనా ఒక్కసారి వింటే చాలు. అట్టే పట్టుకుంటాడు, వయసుకు మించిన ప్రశ్నలు వేస్తూంటాడు.

వాటికి జవాబు చెప్పాలంటే తండ్రికీ చేత కాదు. మరెవరికీ సాధ్యం కాదు. ఇంత గ్రహణ శక్తిగల బాలుడికి విద్య చెప్పే గురువు సామాన్యుడైతే లాభం లేదు.

కనుకనే భార్గవుడు కష్టపడి తగిన గురువు కోసం వెతకవలసి వచ్చింది. తన గ్రామంలోనే ఒక గురుకులం ఉంది. కాని అది పసివాడి బుద్ధిబలం వృద్ధి చేయగలది కాదు.

అక్కడికి రెండామడల దూరంలో శిలాపీఠమనే ఊరిలో కర్మఠీయుడనే వృద్ధుడి గురుకులముంది.

ఆయన శిష్యులందరూ ప్రతిభావంతులై పేరు పొందుతున్నారని చాలామంది చెప్పారు. కాని భార్గవుడికి సందేహం పట్టుకుంది.

అంత గొప్ప గురువైతే రాజాశ్రయం పొందకుండా గ్రామంలో ఎందుకు పడి వుంటాడు? అటువంటి వాడి పోషణకు గ్రామస్థులంతా పోగు చేసి ఏ పాటి ఇవ్వ

వి. లావణ్య



గలరు? నిజంగా గొప్పవాడే అయితే ఈపాటికి బస్తీ చేరుకుని బోలెడంత సంపాదించడా? గురుకులంలో పిల్లవాడిని వదులుదామంటే, ఎడబాటుకు సహించడం కష్టమనుకున్నాడు భార్గవుడు.

ఏమైనా కానీ, ఇంతమంది చెప్పే విషయాన్ని నిర్లక్ష్యం చేసి ఊరుకోవడం భావ్యం కాదు. ఒకసారి చూసి వస్తే పోయేది లేదు కదా అని తలిచి, ఒకనాడు భార్గవుడు మంచిదినం చూసుకుని, కానుకలు చేత పట్టుకుని, కొడుకును వెంటబెట్టుకు కర్మఠీయుడి వద్దకు బయల్దేరాడు.

చీకటి పడేవేళకు ఆ గురుకులం చేరుకున్నాడు. ఆ సరికి కర్మఠీయుడు దగ్గరలో చెరువుకు స్నానానికి వెళ్ళి ఉన్నాడు. ఇంట్లో ఉన్న ఆయన భార్యా, బిడ్డలూ అతిథుల్ని చక్కగా ఆదరించారు.

తను కూడా చెరువుకు వెళతానని కుతూహలపడ్డాడు భార్గవుడు, గురువుగారి పెద్ద కొడుకూ, ఆరేళ్ల మనవడూ ఆయన్ని చెరువుకు తీసుకుపోయారు. వీళ్లు వెళ్లేటప్పటికి బట్టలుతుకుతూ కనిపించిన కర్మఠీయుడికి భార్గవుడు నమస్కరించాడు.

క్షేమాదికాలైన తరవాత, 'గురూత్తమా! ముఖ్యమైన రెండు రంగుల్లోనూ మీకు రెండోదే చాలా ముఖ్యమా?' అని అడిగాడు భార్గవుడు.

'రెండూ చాలా ముఖ్యమే. ఇది లేకపోతే అది లేదు. అది లేకపోతే ఇది లేదు,' అంటూ గురువు జవాబు చెప్పాడు. పక్కనే ఉన్న గురువుగారి మనవణ్ణి చూసి భార్గవుడు, 'అబ్బాయి! మా మాటలు నీకు అర్థమైనాయా?' అన్నాడు.

అందుకా పిల్లవాడు, 'అర్థం కాకేం? పగటికన్నా రాత్రే మీకు చాలా ముఖ్యమా? అని మా తాతయ్యను మీరడిగారు, రెండూ ముఖ్యమేనన్నారు తాతయ్య,' అని చెప్పాడు.

తరవాత భార్గవుడు, 'నిండు పన్నెండూ ఉండగా, మీవంటి వృద్ధులు ఆరోవంతులో బాధపడటమెందుకు స్వామీ?' అని మళ్లీ ఆయన్ని ప్రశ్నించాడు.

అందుకు కర్మఠీయుడు, 'నేను పుట్టిన తరవాత, చచ్చి మళ్లీ పుట్టిన ముప్పయి

రెండు సంతతులింకా బతికే ఉన్నాయి. అందుకే,' అని బదులు చెప్పాడు.

ఈ సంభాషణలో భావమేమిటని భార్గవుడీసారి గురుపుత్రుణ్ణి అడిగాడు.

అందుకతడు ఇలా చెప్పాడు: 'మీరు మా నాన్నగారిని శిశిర రుతువైన ఈ చలిలో ఎందుకు కష్టపడతారీ వృద్ధాప్యంలో అని ప్రశ్నవేశారు. దానికి మా తండ్రి, నాకు పళ్లన్నీ దృఢంగా ఉండి జీర్ణశక్తికి తోడ్పడుతున్నాయి. కనుకనే ఈ శీతలాన్ని భరించే శక్తి నాకున్నది,' అని బదులిచ్చారు, అన్నాడు.



తరవాత భార్గవుడు మళ్లీ కర్మఠీయుణ్ణి ఉద్దేశించి, 'అయ్యా! తరచు ఇళ్లు కడుతూ, పడగొడుతుండేవాళ్లు ఎందరున్నారండీ?' అని అడిగాడు.

దానికి గురువు, 'అటువంటి పనిచేసి మానుకున్న వాళ్లు నలుగురు. ఇప్పుడు వాళ్ల తరపు వాళ్లు ఆ పని చేస్తున్నారు,' అంటూ జవాబు చెప్పాడు.

ఈ ప్రశ్నకు కూడా గురువుగారి కొడుకే వివరణ చెప్పాడు: 'మీ ఇంట్లో చిన్నపిల్లలెంతమంది? అని ప్రశ్న. అందుకు మా నాన్నగారు, నాకు నలుగురు కొడుకులు, చాలామంది మనమలూ, అని సూచించారు,' అన్నాడు.

మళ్లీ భార్గవుడు, 'స్వామీ! మీరు తరచుగా కాంతికన్యను తెస్తూ ఉంటారనుకుంటాను. నా మాట నిజమేనా?' అని అడిగాడు.

ఈ మాటకు గురువు, 'లేదు, కాంతి కన్యను తెస్తే వస్త్రభూషణలిచ్చి మళ్లీ మర్యాదగా సాగనంపాలి కదా? కనుక మా స్వంత కన్యనే ఎప్పటికీ నమ్ముకుని ఉంటాం. అదే మాకు పదివేలు.' అని జవాబు చెప్పాడు.

గురు కుమారుడు దీని అర్థం ఇలా చెప్పాడు: 'అప్పుగా తరచు ధనం తెచ్చుకుంటారా? అని మీ ప్రశ్న. లేదు, స్వంత సంపాదనతోనే కాలక్షేపం చేస్తున్నామని మా నాన్నగారి జవాబు.''

అంతటితో ఊరుకోలేదు. భార్గవుడు. 'కల్పవృక్షాన్ని ఆశ్రయించాలి గాని, కేవలం ఒక చీపురు పుల్లను ఆధారం చేసుకోవడం భావ్యమా?' అని అడిగాడు.

దీనికి సూక్ష్మంగా, 'కల్పవృక్షం లేక చీపురు పుల్ల మాత్రం ఎలా వస్తుంది? చీపురుపుల్లలు కూడితేనే పరిశుభ్రత వస్తుంది. పరిశుభ్రతే లక్ష్మీప్రదం,' అన్నాడు కర్మఠీయుడు.

ఈ సమస్యను గురించిన వివరణ ఇలా చెప్పాడు, గురువుగారి కొడుకు: 'రాజాశ్రయం లేక గ్రామం ఉండదు. నేనే గ్రామాన్ని అలక్ష్యం చేస్తే బాగు చేసేదెవరు? గ్రామస్థులందరూ విద్యావంతులై, ఏకీభావంగా ఉంటే గ్రామంలో తెలివిమంతులకు రాజాశ్రయం కలగవచ్చు--అని, మీ ప్రశ్నకు నాన్నగారి జవాబు.'

ఇలా పరస్పరం సంభాషణ జరుగుతూ ఉండగా గురువుగారి మూడేళ్ల మనవరాలు గబగబ చెరువు వద్దకు పరుగెత్తుకువచ్చింది. వచ్చీరాగానే తాతకు ఊపిరాడకుండా ప్రశ్నల వర్షం కురిపించ సాగింది.

ఆ పాపను చూసి ఎంతో ముచ్చట పడిన భార్గవుడు, 'అమ్మాయీ, నేనొక చిన్న ప్రశ్న వేస్తా జవాబు చెప్పు మరి, చూద్దాం,' అన్నాడు.

'అడగండి మరీ,' అంది పిల్ల కళ్లు తిప్పుతూ. 'మౌనంగా ఉండాలంటే ఏం చెయ్యాలి?' అని అడిగాడు భార్గవుడు.

ఈ ప్రశ్నకు ఏమాత్రం తడుముకోకుండా ఒక్క గుక్కలో 'అల్లరి చేయాలి,' అనేసి గిరుక్కుమని తిరిగి ఇంటికి పారిపోయింది పిల్ల.

అందరూ నవ్వుకున్నారు. భార్గవుడు ఆశ్చర్యపోయాడు. మనసులో మరెట్టి సంశయమూ లేకుండా ఆయన తన కొడుకును కర్మఠీయుడి గురుకులంలోనే చర్చించాడు.

కాలక్రమాన దీపకుడు గొప్ప విద్వాంసుడై, కులదీపకుడై తండ్రికి మంచి కీర్తి తెచ్చాడు.





# ప్రాప్తం

పూర్వం రాజులకాలంలో ఊళ్లపై దొంగల ముఠాలు దాడి చేసి ఇళ్లలో విలువైన బంగారు నగలు, వెండి నాణేలు దోచుకుంటూ ఉండేవారు.

అందువలన ధనవంతులు తాము సంపాదించిన బంగారం, వెండి వజ్రాలు, రత్నాలు వంటి విలువైనవి బిందెలలో పెట్టి భూమిలో పాతిపెట్టేవాళ్లు.

ఇంటి యజమాని చనిపోయే ముందు తాము పాతిపెట్టిన ఆ బిందెలు ఎక్కడ దాచిందీ కొడుకులకు చెప్పేవారు.

ఒకసారి పుల్లయ్య అనే వ్యాపారి కొడుకులకు ఆ రహస్యం చెప్పకుండా ఆకస్మికంగా అర్థరాత్రి నిద్రలోనే చనిపోయాడు.

అతనికి నలుగురు కొడుకులు. తండ్రి చనిపోయినందుకు కాకుండా, తమకు బంగారు దాచిన స్థల రహస్యం చెప్పకుండా చనిపోయినందుకు వాళ్ళు భోరుమని ఏడవసాగారు.

వీధిలో పోతున్న సాధువు ఆ ఇంటి ముందు ఆగాడు. మామూలుగా, ఇంట్లో ముసలి వాళ్లు చనిపోతే, భార్య కూతుళ్లు ఏడుస్తారు. సంప్రదాయానికి భిన్నంగా ఇక్కడ మగవాళ్లు ఏడవడం ఏమిటా అని తెలుసుకుందాం అని కుతూహలం కలిగింది సాధువుకి.

'జాతస్య మరణం ధృవం. ఆయన వృద్ధుడై మరణించాడు. మీరు మగపిల్లలు. ధైర్యంగా ఉండాలి. ఎందుకు ఏడుస్తున్నారు?' అన్నాడు సాధువు.

'స్వామీ, మేము ఏడుస్తున్నది ఆయన చనిపోయినందుకు కాదు. బంగారం,

వాణిశ్రీ

వెండి, రత్నాలు ఎక్కడ దాచి పెట్టాడో, ఆ రహస్యం చెప్పకుండా పోయాడు. అందుకు ఏడుస్తున్నాం,' అన్నారు పుల్లయ్య కొడుకులు.

'ఐతే, నేను మీ తండ్రిని కొన్ని క్షణాలు బతికిస్తాను. ఆ రహస్యం తెలుసుకోండి. గుర్తుంచుకోండి. ఆయన బతికేది కేవలం కొన్ని క్షణాలే,' అన్నాడు సాధువు.

పుల్లయ్య కొడుకులు ఎంతో సంతోషించారు. సాధువుకి కృతజ్ఞతలు తెలిపారు.

సాధువు పుల్లయ్యని బతికించాడు.

పుల్లయ్య కళ్లు తెరిచాడు. చుట్టూ చూశాడు.

'నాన్నా, బంగారం ఎక్కడ దాచి పెట్టావు?' అని కొడుకులు ఆదుర్దాగా అడిగారు.

పుల్లయ్య ఆ సంగతి చెప్పకుండా నలుగురి కొడుకుల్ని పేరుపేరునా పిలిచాడు.

'పెద్దోడా?'

'ఉన్నాను నాన్నా'

'చిన్నోడా?'

'ఇక్కడే ఉన్నాను.'

'చిట్టోడా?'

'నాన్నా ఉన్నాను.'

'పాపాయీ,'

'నేను ఇక్కడే ఉన్నాను నాన్నా,'

పుల్లయ్య కోపంతో మండిపడుతూ, 'తెలివితక్కువ దద్దమ్మల్లారా! అందరూ ఇక్కడే ఉంటే కొట్టుదగ్గిర ఎవర్రా వ్యాపారం చేసేది?' అన్నాడు.

మరుక్షణంలో కళ్లు మూశాడు. పుల్లయ్య చనిపోయాడు. తండ్రి పాతి పెట్టిన నిధి రహస్యం తెలుసుకునే అవకాశం శాశ్వతంగా పోయిందని అర్థమై కొడుకులు లబోదిబోమని ఏడవడం మొదలు పెట్టారు.

'ఆ ధనం మీకు ప్రాప్తంలేదు నాయనా!' అని నవ్వుకుంటూ వెళ్లిపోయాడు సాధువు.





# శ్రీరామచంద్రులు

భూషయ్య రంగాపురం గ్రామపెద్దల్లో ఒకడు. జాలిగుండె గలవాడనీ, ధర్మాత్ము డనీ ఊళ్లో మంచి పేరు కూడా ఉంది. అయితే అదే ఊళ్లో ఉంటున్న జన్నయ్యను మాత్రం ఆ మాటలన్నిటి కంటే భూషయ్య పిల్లలు తండ్రి మాట జవదాటరన్న మాట ఒక్కటీ బాగా ఆకట్టుకునేది. అందుకు కారణం కూడా లేకపోలేదు. భూషయ్య పిల్లలు తండ్రి మాట జవదాటరన్నది ఊరూ వాడా చెప్పుకునే మాటైతే, జన్నయ్య నలుగురు కొడుకులూ అసలు తండ్రి మాట ఖాతరే చెయ్యకపోవడం అతను గుట్టుగా దాచి ఉంచే నిజం.

భూషయ్యకు ముగ్గురు కొడుకులు, ఒక కూతురు. అంతా బాగా ఎదిగొచ్చినవారే. ఆఖరివాడికి తప్ప మిగతా అందరికీ పెళ్ళిళ్లయ్యాయి. కూతురు అదే ఊళ్లో హాయిగా కాపురం చేసుకుంటోంది. భూషయ్య మేనల్లుడే అతని అల్లుడు. అతనికి కూడా మామగారి మాట అంటే ఎంతో గురి.

పెళ్లిళ్లయిన భూషయ్య పెద్ద కొడుకులిద్దరూ తల్లిదండ్రులతో బాటు కలిసి ఉంటూ రవంత రొష్టు కూడా లేకుండా ఎంతో ప్రతిష్టగా ఉమ్మడి సంసారం సాగిస్తున్నారు. పిల్లలు తండ్రులవుతున్నా తన పిల్లలు తనని ఎంతో గౌరవిస్తారని, తన సలహా సంప్రదింపులు లేనిదే ఏ పనీ చెయ్యరని భూషయ్య ఎంతో గర్వంగా చెప్పుకుంటాడు. అతని భార్య కూడా అమ్మలక్కలందరి ముందూ తన కోడళ్లు తనని ఎంతో గౌరవిస్తారంటూ మెచ్చుకుంటుంది. పోనీ ఆ మాటలేమైనా అబద్ధాలేమోననుకుంటే వారి కుటుంబాన్ని చూసేవారందరికీ అందుబాటులో లేని మాట ఒక్కటి కూడా లేదన్నది స్పష్టంగా తెలుస్తుంది. ఇలా సాక్ష్యాధారాలతో సహా భూషయ్య కొడుకుల శ్రీరామచంద్రత్వం రుజువవు

లక్ష్మీ గాయత్రి



తున్న కొద్దీ జన్నయ్య తన పిల్లల్ని తలచుకుని బాధపడటం మరింత ఎక్కువైంది.

అలా కొన్నాళ్లు గడిచాక ఒకరోజు జన్నయ్య మాటల సందర్భంలో తన కడుపులో బాధం తటినీ భూషయ్యతో చెప్పుకున్నాడు. 'బావా! నువ్వు నాకెప్పటినుంచో తెలిసినవాడివి కాబట్టి నీతో ఉన్నమాట చెప్పుకున్నాను. నా కొడుకులు నలుగురిలో ఒక్కడికి కూడా నేనంటే గౌరవం లేదు. నా మాట అసలు చెవిన పెట్టరు సరికదా ఒక్కోసారి నేను అడ్డు చెప్పబోతానని నాకు తెలియకుండానే పనులు చక్కబెట్టుకుంటారు. పెద్ద కోడళ్లిద్దరిదీ కూడా ఒకే దారి. కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుందని నేను, నా భార్య ఇంటిగుట్టును పదిలంగా కాపాడుకుంటూ వస్తున్నాం. వయసు మీద పడుతున్న కొద్దీ పిల్లలు మనల్ని గౌరవించి మన మాటకు విలువ ఇచ్చినప్పుడే కదా సంతోషం? అదే లేనప్పుడు ఇక నేనూ నా పెళ్లామూ ఇంట్లో ఉంటేనేం అడవికి పోతేనేం?' అన్నాడు.

జన్నయ్య మాటలు విన్న భూషయ్య ఒక్క క్షణం నిశ్శబ్దంగా ఉండి, తర్వాత, 'జన్నయ్యా! ఇందులో నీ తప్పేమైనా ఉందేమో ఎప్పుడైనా ఆలోచించుకున్నావా?' అంటూ ప్రశ్నించాడు.

ఆ మాటకు జన్నయ్య కాస్త నొచ్చుకుని, నిష్ఠురంగా... 'భలే మాట అన్నావు బావా! నా మాట వినకపోవడంలో కూడా నా తప్పుంటుందా? అంటే నేను వాళ్లకు నచ్చే మాటలు చెప్పాలి కాబోలు! ఆ మాట నాకు తెలియదులే!' అన్నాడు.

ఇక భూషయ్య మరేమీ తర్కించకుండా, 'పోన్లే జన్నయ్యా! పిల్లలు ఎల్లకాలమూ ఒక్కలాగే ఉండరులే. నాలుగు రోజులు గడిస్తే నీ పిల్లల్లోనూ మంచి మార్పు రావచ్చు. అందాకా ఒక పదిరోజులు మా ఇంట్లో ఉండి చూడు.. కాస్త నీకు ఊరటగా ఉంటుందేమో?' అన్నాడు.

ఆ మాటకు జన్నయ్య చాలా సంతోషించాడు. ఎందుకంటే అతని కోరికా అదే. ఒకరు గాకపోతే ఒకరైనా భూషయ్య మాట పెడచెవిన పెట్టకుండా అందరూ ఆయన మాటను తు.చ తప్పకుండా పాటించడం వెనుక ఏదో కిటుకు ఉండే ఉంటుందనీ, నాలుగు రోజులు భూషయ్యతో బాటు నీడలా ఉంటూ ఆ కిటుకేమిటో గ్రహించాలనీ జన్నయ్య ఎప్పటినుంచో అనుకుంటూనే ఉన్నాడు. ఇన్నాళ్లకు రోగీ పాలే కోరాడు. వైద్యుడూ పాలే తాగమన్నాడన్న రీతిలో భూషయ్యే తనను ఆహ్వానించడంతో పొంగిపోయిన జన్నయ్య అతనికి బోలెడన్ని కృత

జ్ఞతలు చెప్పుకుంటూ ఆ సాయంత్రమే నాలుగు జతల బట్టలు సంచిలో వేసుకుని భూషయ్య ఇంటికి వచ్చేశాడు.

జన్నయ్య భూషయ్య ఇంటికి వచ్చేసరికి అతడు తన పెద్దకొడుకు రామంతో ఏదో మాట్లాడుతున్నాడు. జన్నయ్య ఆసక్తిగా వెళ్లి పక్కనే కూర్చుని వినడం ప్రారంభించాడు. రామం వ్యవసాయం చేస్తాడు. వారిపొలంలో వరి బంగారంలా పండుతుంది. అయితే ప్రతి యేడూ వేసే వరి వంగడాల్ని గాకుండా ఏవో కొత్త రకం వంగడాల్ని వేస్తే వంట మూడు రెట్లు పెరుగుతుందంటున్నాడు రామం. అవేమిటో మంచీ చెడ్డా తెలుసుకోకుండా దురాశకి పోయి వెయ్యడానికి భయపడుతున్నాడు భూషయ్య. పర్వాలేదంటూ నచ్చజెప్పచూస్తున్నాడు కొడుకు.

ఆ రకంగా నడుస్తున్న తండ్రీకొడుకుల మాటల మధ్యకి తలదూర్చిన జన్నయ్య, రామం తండ్రి మాటను కాదంటూ మాట్లాడటం చూసి లోలోపల సంతోషించాడు. భూషయ్య కొడుకులు కూడా అతని మాటల్ని ఖాతరు చెయ్యరన్నమాట. ఇంట్లో జరిగే తంతు వీధిన పడకుండా భూషయ్య నెట్టుకొస్తున్నాడు కాబోలు. నేనిలా రావడం వల్ల ఈ నిజం బయటపడింది!' అని ఆనందిస్తూనే పైకి భేషజంగా తనూ ఓ మాట కలుపుతూ, 'ఒరే రామం, నాన్న పెద్దవాడు. అనుభవం గలవాడు. ఆయన మాట తోసిరాజు చేసి నీ మాట చెల్లించుకోవాలని చూడకు!' అంటూ పెద్దరికంగా మందలించాడు.

జన్నయ్య మాటలకు భూషయ్య చలించలేదు. రామం మాత్రం జన్నయ్య వైపు విచిత్రంగా చూస్తూ, 'నాన్న మాట కాదని



నా మాట చెల్లించుకోవడమా.. ఇన్నాళ్లకు మా ఇంట చాలా కొత్తమాటలు వింటున్నాను జన్నయ్య మామా!' అన్నాడు.

ఆ మాటకు జన్నయ్య మరింత రెచ్చిపోయి, 'మరి నువ్విప్పుడు చేస్తున్నది అదే కదరా. కాదని బుకాయించ చూస్తావేం.' అన్నాడు.

ఆ మాటకు రామం ఫకాలున నవ్వి, 'నువ్వు మీ ఇంట్లో ఎప్పుడూ ఇలాగే మాట్లాడతావు కాబోలు. అందుకే నీ కొడుకులంతా మా నాన్నతో పడలేకపోతున్నామంటూ గోల పెడతారు. ఏ కారణం చేతనో నీకు నేనూ మా నాన్నా మాట్లాడుకున్న మాటలు వాదులాటలా కనిపించాయి గాని మా ఇంట్లో మా నాన్నతో సహా ఎవరం ఎప్పుడూ దేనికోసమూ వాదించం. మా మాటే నెగ్గించుకోవాలని చూడం. మేం చేసే పనల్లా మా అభిప్రాయాల్ని ఒకరితో ఒకరం చెప్పుకోవడం, చర్చిం

చుకోవడం, ఏది మంచిదైతే అది చెయ్యడం మాత్రమే!' అన్నాడు.

రామం మాటలకు జన్నయ్య తెల్లబోతూ మరేదో అనబోయేంతలో భూషయ్య కల్పించుకుని, 'జన్నయ్యా! నీకు నేను ఏం చెప్ప దలచుకున్నానో అది చెప్పే సమయం చాలా త్వరగానే వచ్చింది. విను!' అంటూ ఇలా చెప్పసాగాడు.

'నీ పిల్లలు నువు చెప్పిన మాటల్లా వినడం లేదన్నదే కదా నీ బాధ. కాని నాకు అటువంటి బాధ ఎన్నడూ లేదు. ఎందుకంటే తరాల్లో అంతరాల్ని నేను నీ కంటే బాగానే గుర్తించాను. పెద్దవాళ్ల అనుభవం పిన్నవాళ్ల అవగాహనల్ని జత చేసుకుంటే అద్భుతమైన ఫలితాలన్ని సాధించవచ్చునని గ్రహించి అదే మాట నా పిల్లలకు నూరి పోశాను. ఏ కుటుంబంలోనైనా ప్రస్తుత కాలం గురించి పిల్లలకు తెలిసినంతగా పెద్దలకు తెలియదు. అంచేత వర్తమానం గురించిన వారి అవగాహనకు, అభిప్రాయాలకు మనం విలువ ఇచ్చి తీరాలి. అలాగే కేవలం వర్తమానం తెలిస్తే సరిపోదు. గతానుభవాల నేపథ్యంలో నడిస్తేనే బతుకులు సవ్యంగా గడుస్తాయి. వయసు మీద పడ్డ మనం పిల్లలకు ఇవ్వగలిగింది ఆ అనుభవసారమే. అందుకే మా ఇంట్లో విషయం ఏదైనా సరే నేనూ నా పిల్లలూ కలిసి కూర్చుని చర్చించుకుంటాం. పిల్లల అవగాహనను నా అనుభవంతో జత చేస్తాను.

ఉదాహరణకు ఇప్పటి సంగతే తీసుకుంటే రామం చెబుతున్న కొత్త వంగడాల మంచి చెడ్డల గురించి నా కంటే వాడికే బాగా తెలుసు. నేను చెయ్యవలసిందల్లా నా అనుభవాన్ని ఊతం చేసుకుని వీలైనంత వరకూ వాడు నష్ట పోకుండా చూడటమే. ఒక్క మాటలో చెప్పాలంటే పిల్లలు తల్లిదండ్రుల మాటల్ని యథాతథంగా పాటించాలనుకోవడం మన మూర్ఖత్వమే. వారి మాటకు విలువ ఇచ్చినప్పుడే వాళ్లూ మన మాటను గౌరవిస్తారు! పితృవాక్పరిపాలన మాటెలా ఉన్నా, బుద్ధిమంతులైన శ్రీరామచంద్రులవుతారు. అవునా కాదా?' అన్నాడు.

జన్నయ్య భూషయ్య మాటను కాదన లేనట్టు... తన తప్పు ఒప్పుకుంటున్నట్లు నిశ్శబ్దంగా తల వంచుకున్నాడు!



# అసలు విషయం

చంద్రయ్య అనే షావుకారు దుకాణంలో చిదానందం అనేవాడు కొత్తగా పనిలో చేరాడు. ఒకరోజు అతడు చంద్రయ్యతో 'అయ్యా! రేపు పనిలోకి రాలేను కాబట్టి సెలవు కావాలి,' అన్నాడు.

చంద్రయ్య విసురుగా, 'ఇవి పండుగ రోజులు. బేరసారాల మాటేం కాను. కుదరదు,' అన్నాడు. చిదానందం బదులు చెప్పకుండా వెళ్ళిపోయాడు.

మరో రెండు రోజులు పోయాక చిదానందం చంద్రయ్య దుకాణం తెరవకముందే అతడింటికి వెళ్ళి, 'ఇవాళ పనికిరాను, సెలవు ఇప్పించండి,' అని అడగ్గా, చంద్రయ్య విసుక్కుంటూ. 'ఇలా చీటికీ మాటికీ సెలవులడగటం ఏమీ బాగోలేదు. దుకాణం తీసే వేళయింది పద,' అన్నాడు.

ఇదంతా చూస్తున్న చంద్రయ్య భార్య అతణ్ణి సైగ చేసి పిలిచి నెమ్మదిగా, 'ఇంతకు ముందున్న పనివాడు చెప్పా పెట్టకుండా సెలవు పెడుతున్నాడనే కదా పనిలోంచి తీసేసింది. ఇతడికి ఒకరోజు సెలవిస్తే కొంపేమీ మునిగిపోదు కదా!' అన్నది.

చంద్రయ్య నవ్వుతూ, 'నువ్వన్నది నిజమే,' అంటూ వెళ్ళిపోతున్న చిదానందాన్ని వెనక్కి పిలిచి 'నువ్వు సెలవడగడం, నేనివ్వననడం, నువ్వు మాట్లాడకుండా వెళ్ళిపోవడం చూస్తుంటే అది నీ విధేయత అనుకోవాలా లేక నిజంగా కావలిసే సెలవు అడుగుతున్నావా?' అన్నాడు.

'అయ్యా! నాకు కావల్సింది మీరు సెలవు ఇవ్వననడమే,' అన్నాడు చిదానందం.

అతని సమాధానానికి చంద్రయ్య, భార్య అవాక్కయ్యారు. చిదానందం వాళ్ళతో 'మొన్న సెలవడిగింది, పొరుగూరి పుట్టింటిలో నా భార్యని దిగబెట్టి రావడానికి. ఒకసారి అక్కడికి వెళ్ళిందంటే, ఆమె ఒక పట్టాన తిరిగి రాదు. ఇవాళ సెలవిమ్మన్నది ఆమెని దేవుడి తిరణాళ్ళలో తిప్పి తీసుకురావడానికి. అక్కడ ఆమె నాచేత పెట్టించబోయే ఖర్చుని భరించే స్తోమత నాకు లేదం'టూ వెళ్ళిపోతుంటే, 'అసలు విషయం ఇదా' అంటూ వాళ్ళిద్దరూ కడుపుబ్బేలా నవ్వుకున్నారు.

- జొన్నలగడ్డ రత్న





# పంచతంత్ర కథలు

ఈ మాట విని దమనకం తనలో 'వీడికి చాలా బలం ఉన్నది. వాడిగల కొమ్ములు ఉన్నాయి. విధి కలిసి వస్తే, వీడు నా యజమానిని యుద్ధంలో చంపినా చంపవచ్చు. అలా ఎన్నటికీ జరగరాదు. అందుచేత వీడి బుద్ధి యుద్ధం మీదినుంచి మళ్లేటట్టు చెయ్యాలి,' అనుకుంది.

పైకి, 'మిత్రమా, అవతలి వాడి బలం అంచనా వెయ్యకుండా యుద్ధానికి తల పడి లాభం లేదు. నీ వంటి ఎద్దు పింగళకం లాంటి సింహంతో ప్రత్యక్ష పోరాటానికి దిగి గెలవటం ఎలా సాధ్యమవుతుంది. అందుకు శక్తి వంతులా, యుక్తిపరులా సహాయం ఉండాలి. వెనకటికి ఉల్లంకి పిట్ట అలాగే కదా సముద్రాన్ని గెలవగలిగింది?' అన్నది.

'ఏమిటా కథ?' అని సంజీవకం దమనకాన్ని అడిగింది.

దమనకం ఇలా చెప్పింది.

## సముద్రాన్ని జయించిన ఉల్లంకిపిట్ట

ఒక మహాసముద్రం తీరాన ఉల్లంకి పిట్టల జత ఉండేది. ఆడపిట్ట గర్భిణిగా ఉండి, గుడ్లు పెట్టడానికి మంచి స్థలం చూడమని తన భర్తను అడిగింది. 'మనముంటున్న ఈ సముద్ర తీరానే గుడ్లు పెట్టు. ఇది మనకు అనాదిగా ఉన్న స్థానం,' అన్నది మగపిట్ట.

'వద్దు, వద్దు, సముద్రం మరీ దగ్గిరలో ఉన్నది. సముద్రం పొంగినప్పుడు నా గుడ్లు కాస్తా కొట్టుకుపోవచ్చు,' అన్నది ఆడపిట్ట.

'పిచ్చిదానా! ఈ సముద్రం నన్ను అన్యాయం చేయడానికి సాహసించలేదు. దానికి నా సత్తా తెలుసు. చిన్న చేపలూ,

మిత్రభేదం – **18**

ఇతర ప్రాణులూ తనలో సుఖంగా జీవి స్తుండగా సముద్రం అలాటి పని తెగించి చెయ్యగలదా?' అన్నది మగపిట్ట.

ఆడపిట్టకు తన మొగుడి సామర్థ్యం తెలుసు గనక, 'అలా ప్రగల్భాలు పలికి అపహాస్యం పాలు కాబోకు. నీకున్న బలమెంతో ఎరగవా? వాచాలత్వం తోనే గదా తాబేలు నాశనమయింది?' అన్నది.

'ఏమిటా కథ?' అని మగ పిట్ట అడి గింది.

ఆడ పిట్ట తాబేలు కథ ఇలా చెప్పింది:

ఒక చెరువులో కంబుగ్రీవం అనే తాబేలు ఉండేది. దానితో సంకటం, వికటం అని రెండు కొంగలు స్నేహంగా ఉండేవి.

కొంత కాలానికి నీటి కరువు వచ్చి, చెరువు ఎండి పోసాగింది. అందుచేత కొంగలు మరొక చెరువుకు మారదలు చుకుని, ఆ సంగతి తమ మిత్రుడైన తాబేలుతో చెప్పాయి.

'మీకన్న నేను ఎక్కువగా నీటిలో జీవి స్తాను. నన్ను కూడా ఎలాగైనా ఇక్కడినుంచి తీసుకుపోయే మార్గం చూడండి' అన్నది తాబేలు.

'నువు ఎగరలేవు గద! మేం ఏం చెయ్య గలం? ఇలా రాసి పెట్టి ఉన్నది,' అన్నాయి కొంగలు.

'మిత్రులారా! ఆపదలో నిరాశ పనికి రాదు. ధైర్యం ఉన్న వారికి ఏదో మార్గం దొరుకుతుంది. వివేకవంతులు తమ



ఆప్తులను కాపాడాలని శాస్త్రం చెబుతు న్నది,' అన్నది తాబేలు.

మూడూ అలా చాలాసేపు ఆలోచించిన తరవాత తాబేలుకు ఒక మంచి ఉపాయం తట్టింది. ఒక కర్రపుల్ల తెచ్చి, దాన్ని కొంగలు రెండు చివరలా ముక్కులతో పట్టుకుని, తాను దాని మధ్యభాగాన్ని నోటితో పట్టుకుంటే, కొంగలు ఎగురుతూ తనను కూడా తీసుకుపోవచ్చు!

ఈ పద్ధతి చాలా ప్రమాదమని, దారిలో తాబేలు మాట్లాడటానికి ప్రయత్నిస్తే ప్రాణం పోతుందనీ కొంగలు అన్నాయి. దారిలో తాను నోరు విప్పనని తాబేలు ప్రమాణం చేసింది. కొంగలు ఒక కర్రపుల్ల తెచ్చి, దాని మధ్యభాగాన్ని తాబేలును

నోటితో పట్టుకోమని, తాము దాని చివరలు ముక్కులతో పట్టుకుని, పడితే ప్రమాదం లేకుండా కొద్ది ఎత్తులోనే ఎగురుతూ పోసాగాయి.

అవి ఒక ఊరు మీదిగా పోతుండగా, గ్రామస్థులు కొంగలనూ తాబేలునూ చూసి హస్యాలాడసాగారు. తాబేలుకు కోపం వచ్చి, 'ఈ మనుషులకు బుద్ధిలేదా?' అన బోయింది. కాని మాట పూర్తి కాకుండానే కింద పడింది. గ్రామస్థులు దాన్ని పట్టుకుని చంపి తినేశారు.

ఆడ ఉల్లంకి పిట్ట తాబేలు కథ చెప్పి, ఇంకా ఇలా అన్నది:

అరణ్యం మధ్య ఒక మడుగులో అనాగ విధాతా, ప్రత్యుత్పన్నమతీ, యద్భవిష్యతి అనే మూడు పెద్ద చేపలు స్నేహంగా ఉండేవి. ఒకనాడు కొందరు జాలర్లు ఆ మడుగు పక్కగా పోతూ, 'ఈ మడుగులో చాలా పెద్ద పెద్ద చేపలున్నాయి. రేపు వచ్చి పట్టుకుందాం,' అనుకున్నారు. ఈ మాటలు అనాగతవిధాత విన్నది. అది ఆందోళనపడి తన మిత్రులను పిలిచి, 'మనం మరొక మడుగుకు వలసపోదాం,' అన్నది.

ప్రత్యుత్పన్నమతి నవ్వి, 'రాబోయే దాన్ని గురించి ముందుగానే దిగులుపడటం దేనికి? నేనిక్కడ చాలా కాలంగా సుఖంగా ఉన్నాను. ఎన్నో అపాయాలను యుక్తిగా తప్పించుకున్నాను. జాలర్లు బహుశా రారు. వచ్చినా నేను ఉపాయంగా తప్పించుకోగలను,' అన్నది. యద్భవిష్యతి కూడా, 'నాకూ వెళ్ళే ఆలోచన లేదు. ఇంకెక్కడా చేపలు దొరకనట్లు జాలర్లు ఈ మారుమూల మడుగుకు ఎందుకు వస్తారు? ఒకవేళ ఇలా జరగాలని రాసి పెట్టి ఉంటే దాన్ని ఎవరు తప్పించగలరు?' అన్నది. ఇది విని అనాగతవిధాత మరొక మడుగుకు వెళ్ళింది. (ఇంకా ఉంది)





# విద్యాఫలం

వివేకపురి యువరాజు విక్రమసింహుడు విద్యాభ్యాసం పూర్తిచేసి, దేశసంచారానికి, మంత్రి కుమారుడైన మాధవునితో కలసి మారువేషాల్లో బయల్దేరాడు. వారిరువురూ దేశాలన్నీ చుడుతూ, అయోధ్యాపురి చేరారు. ఆ నగర సౌందర్యాన్ని వీక్షిస్తూ మైమరచిన విక్రమసింహుడు, తన డబ్బుసంచీని ఎక్కడో జారవిడుచుకున్నాడు. కొన్నిఘడియలు గడిచాక కానీ ఆవిషయం గుర్తించలేదు.

విషయం విన్న మాధవుడు 'యువరాజా! మనం నగర పాలకుని గృహం తెలుసుకుని ఫిర్యాదు ఇద్దాం. ఎక్కడో ఎవరికైనా దొరక్క పోదు.' అంటూ ఆ బజారు వీధిలోని ఒక అంగట్లోని యజమాని వద్దకెళ్ళి 'మహాత్మా! మేము పొరపాటున మా ధనపు సంచీని ఎక్కడో జారవిడచుకున్నాం. ఈ నగర పాల కుని గృహం ఎక్కడో తెలిపితే వెళ్ళి ఫిర్యాదు ఇవ్వదలచాం.' అని అడిగాడు.

ఆ అంగడి యజమాని ఎగాదిగా చూసి 'మీరు పరదేశులని భావిస్తాను, మా నగ రంలో ఇలాంటి ఫిర్యాదులే ఉండవు. తమరు ఏ ఏ వీధుల ద్వారా తిరిగారో అక్కడ వెళ్ళి వెతకండి , మీకు తప్పక లభిస్తుంది.' అని తన పనిలో మునిగిపోయాడు. విక్రమసిం హుడు, మాధవుడు తమ గుర్రాలను దిగి నడిపించుకుంటూ వెనక్కు మళ్ళారు.

అలా వారు వెళ్ళగావెళ్ళగా నాల్గు వీధుల కూడలిలో తాము మంచినీరు సేవించటానికి ఆగిన చోట తమ ధనపు సంచీ పడి ఉండ టాన్ని చూశారు.వారిరువురికీ, కొన్ని ఘడి యల క్రితం పడిన ధనపు సంచీ అలాగే ఉండటం చాలా చిత్రంగా తోచింది! ఎవరైనా దాన్ని తీసుకుంటారేమోనని, వారు ఆ కూడ లిలో మరికొంతసేపు వేచి చూశారు.

అంతా తమతమ పనులమీద వెళుతు న్నారే తప్ప, ఆ సంచీ కేసి చూసినవారే లేరు.

ఆదూరి హైమవతి

చివరకు వారిరువురు తమసంచీ తీసుకుని చూశారు. వేసిన ముడులు వేసినట్లే ఉన్నాయి.

ఐనా మాధవుడు 'యువరాజా! ఈ నగర పౌరులకు మరో పరీక్ష పెడదాం.' అని యువ రాజు అనుమతితో ఆ ధనపు సంచీనుండీ కొన్ని వజ్రాలు, బంగారు నాణాలు తీసి నేలపై, వీధుల కిరువైపులా విసరుతూ వెళ్ళి తిరిగివచ్చి ఓ చెట్టుక్రింద దూరంగా కూర్చుని చూడసాగారు. సాయంకాలమైనా ఎవ్వరూ వాటికేసి చూసినవారే లేరు.

ఈలోగా రాజభటులు వచ్చి 'మహాశయా! మహారాజు గారు ఏర్పాటుచేసిన విశ్రాంతి మందిరంలో విశ్రమించండి. తెల్లవారగానే మీ పని మీద వెళ్ళవచ్చును.' అనిచెప్పి వారికి దారి చూపారు. వారు ఆమందిరంలో ప్రవేశించగానే, ఒక వ్యక్తి వచ్చి వారి గుర్రాలను తీసుకెళ్ళి అశ్వశాలలో ఉంచి దానికి మేపు వేశాడు. మరో వ్యక్తివచ్చి వారికి స్నానం ఏర్పాట్లు చేయగా, ఆ తర్వాత వారికి చక్కని భోజనం అందించి వారు విశ్రమించటానికి మంచి సదుపాయాలు అమర్చారు. తెల్లవారాక వెళ్ళి చూడగా తాము రాత్రి విసరిన బంగారు నాణాలు అక్కడే ఉండటం వారిని ఆశ్చర్యంలో ముంచెత్తింది. వారు వెంటనే మహారాజును వెళ్ళికలసి, తమను పరిచయం చేసుకుని, తమ సందేహాలు వెలిబుచ్చారు.

మహారాజు 'మిత్రులారా!మాదేశంలో ప్రతి పౌరుడూ సకల శాస్త్రాలూ చదివే ఏర్పాటు గావించాం. వారందరికీ మంచి చెడుల గురించిన అవగాహన ఏర్పడింది. ప్రతిఒక్కరూ కష్టపడి తమ వృత్తి విద్యలను చేసుకునేలాగానూ, వారి ఉత్పత్తులను సరైన వెలకే అమ్ముకునే ఏర్పాటూ చేశాం, అందువలన వారికి న్యాయంగానే ధనసంపాదన చేసుకోడం అలవడింది. మా పౌరులెవ్వరూ తమది కాని దానిని ఆశించరు. మాప్రజలకు ఉన్న దానితో తృప్తిపడటం ఇష్టం. విద్యవలన వివేకం ఏర్పడుతుందని మా పితృ దేవులు ప్రజలందరికీ ఉచిత విద్యను అందించేవారు, మేమూ దాన్ని పాటిస్తున్నాం.' అని వారి అనుమానం తీర్చి వారికి అతిధి మర్యాదలు చేసాడు.

దేశసంచారం వలన తాము తెలుసుకున్న విషయాలకు వారిరువురు ఎంతో ఆనందించి తమ నగరానికి తిరుగు ప్రయణమయ్యారు.





# పుష్పక విమానం

విక్రమపురి మహారాజు ధీరసింహుడు, ఒకరోజు రాజోద్యానవనంలో కూర్చుని, రాచకార్యాలు ముచ్చటిస్తున్నాడు. ఆ సమయంలో ఉన్నట్టుండి ఆయన ఆకాశం వంకచూస్తూ, 'చూడండి! ఆకాశమార్గంలో ఏదో విమానం వంటిది పోతున్నది. దానిలో ఉన్న వారు గంధర్వులేమో అన్న అనుమానం కలుగుతున్నది,' అన్నాడు.

అప్పుడు చంద్రకేతుడనేవాడు ఆకాశం కేసి చూసి, 'మహారాజా! తమ దృష్టి అతి నిశితం. వెళుతున్నది పుష్పకవిమానాన్ని పోలివున్నది. అందులో గంధర్వులో, దేవతలో కాక మరెవరుంటారు!' అన్నాడు.

సూర్యబాహు అనే మరొకతను 'మహారాజా! చంద్రకేతుడన్నది నిజం,' అన్నాడు.

రాజ పురోహితుడి కుమారుడు పద్మనేత్రుడు కూడా అక్కడున్నాడు. అతడు తప్ప మిగిలినవాళ్లందరూ సూర్యబాహు, చంద్రకేతులతో శ్రుతి కలుపుతూ, మహారాజు పుణ్యాత్ముడు కనకనే, అటువంటి అపరూప దృశ్యాన్ని తాను చూడడమే కాక, తమబోటి అల్పులకు కూడా చూపగలిగాడని, ధీరసింహుడి మీద పొగడ్తల వర్షం కురిపించసాగారు. పద్మనేత్రుడి మౌనాన్ని గమనించి ధీరసింహుడు, 'ఏమయ్యా, పద్మనేత్రా! అలా బెల్లం కొట్టిన రాయిలా ఉండిపోయావు. విమానం నీకు కనబడలేదా ఏమిటి?' అని మందహాసం చేస్తూ అడిగాడు.

'ప్రభువులు మన్నిస్తానంటేనే, జవాబిస్తాను,' అన్నాడు పద్మనేత్రుడు.

'నీకు వచ్చిన భయమేమీ లేదు. నువ్వు చెప్పాలనుకున్నది నిశ్చింతగా చెప్పు,' అన్నాడు ధీరసింహుడు.

జొన్నలగడ్డ రత్న

అందుకు పద్మనేత్రుడు, 'ప్రభూ! ఇప్పుడు ఆకాశంలో ఎలాంటి విమానమూ వెళ్లలేదు. అంతా వట్టి భ్రమ,' అన్నాడు.

రాజు చిరుకోపంగా, 'నాతో సహా ఇక్కడున్న ఇంతమంది కళ్లారా చూసిన పుష్పక విమానాన్ని, భ్రమ అని తేలికగా కొట్టిపార వేయ్యడానికి తగిన కారణమేమైనా ఉన్నదా?' అని ప్రశ్నించాడు.

పద్మనేత్రుడు వినయంగా, 'ప్రభూ! పుష్పకవిమానాలూ, గంధర్వుల ఆకాశ విహారం వంటివి ఊహల్లోని విషయాలని, హేతుబద్ధంగా ఆలోచించే తమబోటి మేధావులకు తెలియనిది కాదు. నేను కూడా, ఈ సృష్టిలో హేతుబద్ధం కానిదేదీ లేదన్న నమ్మకం ఉన్నవాణ్ణి. ఎప్పుడైనా మన కళ్లకూ, చెవులకూ అసాధారణమైనదేదైనా కనిపించినా, వినిపించినా-- అందుకు కారణం మన మానసిక బలహీనత కాని, శరీరంలో ఉన్న మరేదైనా రుగ్మత కాని కారణం కావచ్చును. కాని తమకు కలిగిన భ్రమలాంటిదే, ఇక్కడున్న ఇంతమందికీ కూడా ఒకేసారి ఎందుకు కలిగిందీ అన్న విషయాన్ని మాత్రం నేను ప్రస్తావించలేదు. ఆ భ్రమకు కారణం వారందరికీ తెలియనిది కాదన్న విషయం మాత్రం నాకు తెలుసు!' అన్నాడు.

ఇది విన్న ధీరసింహుడు, అక్కడ ఉన్న వారందరితో, 'పద్మనేత్రుడన్నది నిజం! నేనెలాంటి విమానాన్ని, గంధర్వులనూ చూడనేలేదు. రాజ్యంలో ప్రస్తుతం ఉన్న పరిస్థితులన్నిటినీ ఎప్పటికప్పుడు నాకు చూసినది చూసినట్టు, చెప్పగలిగే సలహాదారుణ్ణి అన్వేషించే ప్రయత్నంలో, ఈ విమానం వ్యవహారం సృష్టించాను. రాజసభలో ఉన్న మిత్రులైన మీరంతా, నన్ను పొగడుతూ, నాచేత సన్మానాలు చేయించుకోవాలన్న తాపత్రయంలో, వాస్తవాలను నిర్భయంగా నాకు చెప్పి, నా పరిపాలనను మెరుగుపరచాలన్న బాధ్యతను విస్మరించారు. అలాంటి బాధ్యత తెలుసుకున్న ఈ పద్మనేత్రుణ్ణి, నేను ముఖ్య సలహాదారుగా నియమించదలుచుకున్నాను,' అన్నాడు.





# దయాగుణం

సీతాపురంలో లక్ష్మీపతి అనే భాగ్యవంతు డున్నాడు. ఆయన వ్యాపారంలో తన తెలివితేటలతో బాగా రాణించి, కోటికి పడగలెత్తాడు. తనంత గొప్పవాడు లేడని ఆయన అనుకుంటూ ఉండేవాడు.

ఒక రోజున లక్ష్మీపతి ఇంటికి చలపతి అనే బంధువు వచ్చాడు. చలపతికి డబ్బు లేదు కానీ కీర్తి ప్రతిష్టలు ఉన్నాయి. అతణ్ణి చూడడానికి సీతాపురం ప్రజలు లక్ష్మీపతి ఇంటికి తండోపతండాలుగా వచ్చారు.

ఇది చూసి లక్ష్మీపతికి అసూయ పుట్టింది. ఆయన చలపతిని ఏకాంతంలో 'నీలో విశేషమేమిటి? ప్రజలు నిన్ను చూడాలని ఎందుకు తహతహలాడుతు న్నారు?' అని అడిగాడు.

'ఈ ప్రపంచంలో డబ్బు సంపాయిం చడం, అన్నిటికంటే సులభమైన విషయం. డబ్బు సంపాయించాలంటే మనిషి స్వార్థ పరుడు కావాలి. స్వార్థపరులకు సమా జంలో సుఖముంటుంది కానీ ప్రత్యేక గౌరవం ఉండదు.

ఈ ప్రపంచంలో అన్నిటికంటే కష్టమై నది దయాగుణం! సాటి మనిషి కష్టపడు తూంటే, దయాగుణం కలవాడు చూస్తూ ఊరుకోలేడు. దయాగుణం కలవాడు తన శత్రువుల్ని కూడా ప్రేమించగలడు.

దయాగుణంతో నేను నా సిరిసంపదలు పోగొట్టుకున్నాను. దయాగుణం గొప్ప తనాన్ని పదిమందికీ చెప్పి ప్రజల మన సుల్లో మార్పు తీసుకురావాలని, నేను దేశమంతా తిరుగుతూ, ఈ ఊరుకు

వసుంధర



ఒక ఉపాయం చెప్పాడు. ఆ ప్రకారం సీనయ్య, లక్ష్మీపతి ఇంట్లో దొంగతనానికి వస్తాడు. డబ్బు గది తాళాలు లక్ష్మీపతే వాడి కిస్తాడు.

ఆ గది ముందు కాపలా కాసే వీర్రాజును తప్పించుకుని, ఆ గదిలో ఉన్న డబ్బు దొంగిలించడం చాలా కష్టం. వెళితే వాడు పట్టుబడక తప్పదు. అప్పుడు లక్ష్మీపతి వాణ్ణి క్షమించి తన వద్దనే పని ఇస్తాడు.

పరిస్థితుల కారణంగా దొంగగా మారిన వాళ్లందరికీ ఈ సంఘటన కొంత ఆశలు కలిగిస్తుంది!

సీనయ్య దీనికి సంతోషంగా ఒప్పుకుని ఒక రాత్రివేళ లక్ష్మీపతి ఇంటిక దొంగత నానికి వెళ్లాడు. డబ్బు ఉన్న గది తలుపుకు పెద్ద తాళం వేసి ఉన్నది.

కొంచెం దూరంలో వీర్రాజు ఆదమరిచి నిద్రపోతున్నాడు. సీనయ్య కావాలనే కాస్త ఎక్కువ చప్పుడు చేస్తూ తాళం తీశాడు.

వీర్రాజుకు మెలకువ వచ్చింది. ఎవడో దొంగ డబ్బు గదితాళం తీయడం, వాడికి ఆశ్చర్యం కలిగించింది. ఎందుకంటే ఇంటి చుట్టూ పటిష్టమైన కాపలా ఉంటుంది. ఆ కాపలా తప్పించుకుని లోపలికి రావడం ఒక ఎత్తయితే, డబ్బు గది తాళాలు సంపా యించడం ఇంకో ఎత్తు.

అప్పుడు వీర్రాజు రహస్యంగా దొంగన నుసరించి చూడసాగాడు. దొంగ గది లోపలి ఇనప్పెట్టె తలుపులు తెరిచాడు. ఇనప్పెట్టె లోపల నగలు, కాసులు,

వచ్చాను,' అన్నాడు చలపతి. అతడు ఆ ఊళ్లో మరో పది రోజులుండి నాలుగు ఉపన్యాసాలిచ్చి వెళ్లాడు.

తనుకూడా చలపతిలాగా దయాగుణం చూపి పేరు తెచ్చుకోవాలని, లక్ష్మీపతిలో కోరిక పుట్టింది. బాగా ఆలోచించి ఆయన ఒక పథకం పన్నాడు.

ఆ ఊళ్లోనే తనకు తెలిసిన సీనయ్య అనే పేదవాణ్ణి పిలిచి, 'ఒరేయ్! నేను నీకు సాయపడాలనుకుంటున్నాను. గతంలో నువ్వు దొంగతనాలు చేసి ఉన్నావు. అందు కని నీకు ఎవ్వరూ పని ఇవ్వడం లేదు. నేను నీకు పని ఇస్తాను. నీవంటి వారందరికీ సాయపడాలని నా కోరిక. కానీ అలాగని చాటింపు వేయడం నాకిష్టం లేదు. నేను చెప్పినట్టు చేస్తే బాగుంటుంది,' అంటూ



వజ్రాలు చూసేసరికి, దొంగతో పాటు వీర్రాజు కళ్లు కూడా చెదిరాయి.

వాడు దొంగను పట్టుకుని, 'ఇక్కడికి వచ్చి ఇనప్పెట్టె తెరిచావంటే, నువ్వు సామా న్యుడివి కాదు. వదిలిపెడితే తప్పించుకుని పారిపోగలవు. దొంగిలించిన సొమ్ములో సగం నాకిచ్చావంటే, నిన్ను వదిలిపెట్టి మత్తుమందు తీసుకుని పడుకుంటాను. ఎవరైనా అడిగితే, దొంగ నాకు మత్తుమంది చ్చాడని చెప్పొచ్చు,' అన్నాడు.

ఇదేదో కొత్త విశేషంలా కనిపించి సీనయ్య తెల్లబోయాడు. లక్ష్మీపతి సాయపడటం వల్ల తను లోపలికి రాగలిగాడు తప్ప మరొక విధంగా రాలేదు. లక్ష్మీపతిసాయం లేనిదే తనిక్కడినుంచి తప్పించుకోలేడు పాపం. వీర్రాజుకు ఈ విషయం తెలియదు!

సీనయ్య వెంటనే వీర్రాజుకు అసలు విషయం చెప్పి, 'అవకాశం రాకగానీ, మను షులందరిలోనూ దొంగబుద్ధి ఉంటుందని, నీ వల్ల రుజువయింది. నీ సంగతి తెలిస్తే యజమాని నిన్ను పనిలోంచి తీసేస్తాడు. పిచ్చి ఆలోచనలు మాని బుద్ధిగా నన్ను నీ యజమానికి అప్పగించి మంచి పేరు తెచ్చుకో,' అన్నాడు.

వీర్రాజు మరుక్షణం సీనయ్య కాళ్లమీద పడి, 'నిజం చెప్పినా ఉద్యోగం నిలబెట్టావు. ఏదో ఒక రోజున నీ రుణం తీర్చుకుం టాను,' అంటూ వాణ్ణి పట్టుకుని లక్ష్మీపతి వద్దకు తీసుకువెళ్లాడు.

వీర్రాజు చెప్పింది విని, లక్ష్మీపతి, సీనయ్యను అక్కడే ఉండమని చెప్పి, వీర్రాజును బయిటికి పంపి గది తలుపులు వేసి, 'ఒరేయ్, తాళం చెవులు నీకిచ్చి, నేను వూరికే పడుకుని నిద్రపోతున్నాననుకోకు. రహస్యంగా నిన్ను వెన్నంటి వస్తున్నాను. జరిగిందంతా చూసాను. వీర్రాజులో దొంగ బుద్ధి ఉంది.

అటువంటి వాడిని డబ్బుగదికి కాప లాగా ఉంచి నేను పెద్ద పొరపాటు చేశాను. నీవంటి దొంగకున్న నిజాయితీ వాడికి లేదు. వాణ్ణి వెంటనే పనిలోంచి తీసేసి, ఆ ఉద్యోగం నీకిస్తాను. అయితే--వీర్రాజు విషయం నువ్వు ఎందుకు దాచాలనుకు న్నావో, నాకు కారణం చెప్పాలి.

నువ్వు చెప్పిన కారణం నాకు నచ్చితేనే, నీకు ఉద్యోగం ఇస్తాను. వాడితో నువ్వన్న

మాటలన్నీ నేను విన్నాను,' అన్నాడు.

అందుకు సీనయ్య, 'అయ్యా! ఒకసారి దొంగ అనిపించుకున్నవాడికి మళ్లీ ఎక్కడా పని దొరకదు. ఆ ఇబ్బంది నాకు తెలుసు. దొంగ అనిపించుకున్న నన్నే పిలిచి ఉద్యోగం ఇవ్వాలనుకున్న తమరు, దొంగ తనం చేయాలనుకున్నాడని వీర్రాజును పనిలోంచి తీసేస్తారా?

తమరి దయాగుణం తెలిసినవాణ్ణి కాబట్టి, వీర్రాజు మీద తమకెలాగూ కోప ముండదనుకున్నాను,' అన్నాడు.

లక్ష్మీపతి కేమనాలో తోచక, 'నువ్వు చెప్పింది నిజమే! వీర్రాజును నేను క్షమించి విడిచిపెట్టేవాణ్ణే కానీ నువ్వు నాకు వీర్రాజు దొంగబుద్ధి గురించి చెప్పక పోవడం తప్పు కదా!' అన్నాడు.

వీరయ్య తలవంచుకుని, 'తప్పే! కానీ మీరెలాగూ వీర్రాజును క్షమిస్తారు కదా! అందుకని అతణ్ణి నేనే క్షమించి దయా గుణం చూపాలనుకున్నాను.

అయ్యా! మీరు గొప్పవారు. దయా గుణం చూపించే అవకాశం మీకు చాలా సార్లు వస్తుంది. నాబోటి దొంగకు ఇలాంటి అవకాశం ఎప్పుడో కాని రాదు! అందువల్ల, ఆ అవకాశం వదులుకోవాలనిపించలేదు,' అన్నాడు.

ఇది విన్న లక్ష్మీపతి ఆలోచనలో పడ్డాడు. ఒక దొంగకు కూడా దయాగుణం చూపిం చాలన్న కారణం ఉంటుంది. తన కలాంటి కోరిక, ఇంటికి వచ్చిన చలపతిని చూసే దాకా, పుట్టనే లేదు. పుట్టినా-- సీనయ్య చెప్పేదాకా వీర్రాజును క్షమించాలని తట్టనే లేదు!

ఒక్కసారి దయాగుణం చూపాలను కుంటేనే, వీర్రాజు వంటి వాడి దొంగబుద్ధి బయటపడి, తనకెంతో ఉపకారం జరిగింది. ఇవన్నీ ఆలోచించి, లక్ష్మీపతి ప్రచారం, కీర్తికోసం కాక నిజంగానే దయాగుణం అలవరుచుకుని మంచి పేరు తెచ్చుకు న్నాడు.






# వేషభాషలు

గుణపురం గ్రామపెద్దకు ఒకసారి అంతు పట్టని వ్యాధి సంక్రమించింది. ఆయన బంధువులూ, గ్రామస్తులూ, ఆయనకు సోకిన వ్యాధిని గుర్తించాలని ప్రయత్నించారు. ఆ పని వారి వల్ల సాధ్యం కాలేదు.

గ్రామపెద్దకు ఆకలి వేయదు. దాహం పుట్టదు. అతడి భార్య బలవంతం చేసి ఒక అన్నం ముద్ద పెడుతుంది. గుక్కెడు నీళ్లు తాగి ఊరుకుంటాడు. పనులు చేసుకోవడానికి, పంచాయితీ పనులు చక్కబెట్టడానికి, జీవిక ఎక్కడినుండి వస్తోందో ఆయనకే ఆశ్చర్యంగా ఉంటుంది.

ఒక కడు పేదవాడు ఆయనతో, 'మీ జబ్బు నాకు సంక్రమించినా ఎంతో బాగుండేది. ఈ కరువుకాలంలో తిండిగింజలు సంపాదించడం ఎంతో కష్టంగా ఉంది,' అన్నాడు కూడా.

పొరుగు గ్రామంలో ఒకవైద్యుడు ఉన్నాడని తెలిసి గ్రామపెద్ద భార్య ఆ వైద్యుడిని సంప్రదించింది. వైద్యుడు ఆ చుట్టుప్రక్కల బాగా పేరున్నవాడు. ఆయన వద్ద ఎలాంటి రోగి కూడా ఒక నెలకంటే ఎక్కువకాలం పాటు ఔషధాలు వాడకుండానే జబ్బు నయమైపోతుంది. ఆయన డబ్బు దగ్గర కూడా నిష్కర్షగా ఉంటాడు.

గ్రామపెద్ద ఆయనను కలుసుకోబోయిన సమయానికివైద్యుడు తన శిష్యులతోబాటు కలిసి లేహ్యాలు నూరుతూ కనిపించాడు. వైద్యుడు తన ఒంటిమీద తెల్లపంచె తప్ప ఇతర వస్త్రం ధరించలేదు. ఎవరైనా చెబితేనే కాని ఆ ముసలాయనే వైద్యుడని కొత్త వారికి తెలియదు.

గ్రామపెద్ద పెదవులు చప్పరించి, 'ఈయన నా జబ్బు ఎలా తగ్గించగలడు?

ఎమ్. సత్యవతీదేవి

నాడి అంతుపట్టని జబ్బు కూడా అయింది,' అన్నాడు భార్యతో. ఈ మాట భార్యనే కాకుండా, కల్వం నూరుతున్న వైద్యుడికి కూడా వినిపించింది.

ఆయన భార్య గ్రామపెద్దను వారించి, 'వైద్యుడంటే దేవుడితో సమానం. ఆయన ఇచ్చిన మందు తినకుండానే మీరిలా నిర్ణ యించుకోరాదు.' అంది.

కొంత సమయం తర్వాత గ్రామపెద్దను వైద్యుడు పరీక్షించాడు. నాడి పట్టుకుని చూశాడు. పొట్టను రెండు మూడు చోట్ల నొక్కి చూశాడు.

వ్యాధి నిర్ధారణ అయినట్లు తలాడించి, గ్రామపెద్దకు ఔషధాలు అందించాడు. వాటికి సరిపడినంత డబ్బు కూడా తీసు కున్నారు. గ్రామపెద్ద ఔషధాలు వాడటం ప్రారంభించాడు. నెలరోజులు గడిచినా సరే, ఆయన వ్యాధినయం కాలేదు. ఆయనలో ఆకలీ దాహం పుట్టలేదు.

వైద్యుడిని కలిశాడు గ్రామపెద్ద.

ఆయనకున్న వ్యాధి గురించి ఈసారి వైద్యుడిలో ఆరాటం ప్రారంభమయ్యింది. తన వద్ద నెలరోజుల కంటే ఎక్కువ కాలం చికిత్స చేయించుకోనక్కర లేదు.

వైద్యుడికి కాంతిమతి అనే కూతు రుంది. ఈమె తమ ఇంటికి గ్రామపెద్ద మొదటి రోజున వచ్చినప్పుడు ఆయన భావాలూ, ఆక్షేపణలూ గుర్తుంచుకుంది. గ్రామపెద్ద భార్య ఆయనను వారించడం కూడా కాంతిమతి గమనించింది.

రెండో నెలకు మందులు ఇచ్చి గ్రామ పెద్దను పంపించివేశాడు వైద్యుడు. రెండు రోజులు గడిచాక కాంతిమతి తమ పని వాడితో గ్రామపెద్దకు 'మా తండ్రిగారు



తమకు వైద్యవిధానం మార్చమని చెప్పారు. ఆయన గ్రామాంతరం వెళ్లారు. ఆయనకు వైద్యం నేర్పిన హిమాలయ గురువుగారు మిమ్మల్ని పరీక్షిస్తారు. ఒకసారి రండి.' అంటూ కబురు పంపించింది.

హిమాలయ గురువు వింటూనే గ్రామ పెద్ద ఎగిరి గంతేశాడు. వైద్యుడి ఇంటికి చేరుకున్నాడు. కాంతిమతి ఆయను సుఖాసీనుడిని చేసింది.

'గురువుగారు తపోదీక్షలో ఉన్నారు. వేచి ఉండండి,' అన్నది కాంతిమతి. సహనం కోల్పోయేంతవరకు గ్రామపెద్దను వేచి ఉండేలా చూసి, కాంతిమతి చివరికి హిమాలయ గురువును వెలుపలికి సాదరంగా తీసుకువచ్చింది.

హిమాలయ గురువు పైనుండి కింది వరకూ కాషాయవుటంగీ ధరించి ఒంటి నిండా రుద్రాక్షమాలలు దిగేసుకున్నాడు.

మొహమంతా విబూది పూసుకుని నామాలు పెట్టుకున్నాడు. తన నెత్తి మీద అట్టలు కట్టిన జుత్తు ఉంది. ఆయన ఒంట్లోంచి అగరు ధూపాలు వెలువడుతున్నాయి. గ్రామపెద్ద ఆయన ఎదుట సాష్టాంగ పడకుండా ఆగలేకపోయాడు. గురువు ఆయనను పరీక్షించించిన తర్వాత కొన్ని మూలికా ఔషధాలు అందించాడు. గ్రామపెద్ద ఇచ్చిన డబ్బును తిరస్కరించాడు.

'హిమాలయాల్లోని మూలికలకు మనం వెలకట్టలేము. భక్తితో వీటిని వాడు,' అన్నాడు గురువు. గ్రామపెద్దకు మూడు రోజుల్లో జబ్బు నయమయ్యింది.

గురువు అతడికి అందించిన ఔషధం కొత్తది కాదు. మూలికల రూపంలో అందించాడంతే! గురువూ కొత్తవాడు కాదు. వైద్యుడే తన కూతురి సలహా మేరకు తన వేషభాషలు మార్చుకున్నాడు.

'ఈ కాలంలో నైపుణ్యం ఒక్కటే సరిపోదు. అందుకు తగ్గ వేషభాషలు కూడా ముఖ్యమే. నువ్వు చెప్పేవరకూ ఈ సంగతి గ్రహించలేదు సుమా!' అన్నాడు వైద్యుడు కుమార్తెతో.






# తగినవరుడు

విజయపురి ఆస్థానంలో రామశర్మ అనే గొప్ప జ్యోతిష్కుడుండేవాడు. ఆయన ఒకనాటి సూర్యోదయం వేళ, నదికి వెళ్ళి స్నానం చేసి వస్తూండగా, దారి పక్కన ఉన్న ఒక చెట్టు కొమ్మకు, ఉరి వేసుకోబోతున్న యువకుడొకడు కంటబడ్డాడు.

రామశర్మ, ఆ యువకుణ్ణి ఆపి, బాగా మందలిస్తూ, 'నీ పేరేమిటి? ఏ ఊరు నీది?' అని అడిగాడు.

'నా పేరు జయసింహుడు. విజయపురి మా ఊరు,' అని యువకుడు చెప్పాడు.

'పాతికేళ్లయినా నిండినట్టు లేవు. అప్పుడే జీవితం మీద నీకు విరక్తి కలిగిందా?' అని అడిగాడు రామశర్మ.

'మనసారా ప్రేమించిన అమ్మాయిని, పెళ్లి చేసుకునే అదృష్టం లేనప్పుడు, బతికి ఏం ప్రయోజనం?' అని విచారంగా బదులు చెప్పాడు జయసింహుడు. 'ఏదీ నీ చెయ్యి ఇలా చూపించు!' అని రామశర్మ, అతడి హస్తాన్ని కొంచెం సేపు పరిశీలనగా చూసి, 'ఆహా, బ్రహ్మాండమైన వివాహయోగం ఉన్నది. నీకు, పెద్దల సమక్షంలోనే, నువ్వు ప్రేమించిన అమ్మాయితో, నీకు పెళ్లి జరిగి తీరుతుంది. తెలుసా?' అన్నాడు.

'అంత ఖచ్చితంగా మీరెలా చెప్పగలరు?' అన్నాడు జయసింహుడు అనుమానంగా. 'నా పేరు రామశర్మ. విజయపురి ఆస్థానం జ్యోతిష్కుణ్ణి. పేరు వినే ఉంటావు.' అన్నాడు గర్వంగా రామశర్మ.

'ఏ జ్యోతిష్యమో మరి, నేను ప్రేమించింది బ్రాహ్మణ కన్యను. నేనేమో బ్రాహ్మణ్ణి కాను. ఆ అమ్మాయిని తల్లిదండ్రులు నాకెలా ఇస్తారు చెప్పండి?' అని అడిగాడు జయసింహుడు.

బి.రఘురామరాజు

'జాతకంలో రాసిపెట్టి ఉండాలి గాని, పెళ్లికి కులం ఒక ఆటంకమా? వరుడి గుణగణాలు ముఖ్యం గాని, కులంతో పనేమిటయ్యా? ఆ అమ్మాయి తండ్రి మీ పెళ్లికి తప్పక ఒప్పుకుంటాడులే,' అన్నాడు రామశర్మ అభయమిస్తున్నట్టు.

'ఆ అమ్మాయిది ధనిక కుటుంబం. మేము పేదలం. బీదవాళ్లతో వియ్యమందడానికి, ఆ అమ్మాయి తండ్రి ఎలా సిద్ధపడతాడు?' అన్నాడు జయసింహుడు.

రామశర్మ చిరునవ్వు నవ్వి, 'నీకు కాబోయే మామగారు చాలా ధనికుడంటున్నావు. ఆయన ఆస్తిలో కొంత నీకిచ్చి, నిన్ను కూడా ధనికుణ్ణి చెయ్యవచ్చు కదా!' అని సమాధానమిచ్చాడు.

'అదీ నిజమే అనుకోండి. కాని, ఆ అమ్మాయి నాన్న రాజాస్థానంలో పెద్ద ఉద్యోగి. నేను బాగానే చదువుకున్నా. ఇంతవరకు ఉద్యోగం దొరకలేదు. నిరుద్యోగికి పిల్లనివ్వడానికి, ఆయనకు చిన్నతనంగా ఉండదా,' అన్నాడు జయసింహుడు.

'అదొకసమస్యా!, కాబోయే మామగారే తన పలుకుబడి ఉపయోగించి నీకు రాజాస్థానంలో ఉద్యోగం ఇప్పించి తీరుతాడు,' అన్నాడు రామశర్మ.

'జీవితంపై ఆశ లేని నాకు మీ సమాధానాలు జీవం పోశాయి. నేను ప్రేమించిన అమ్మాయితోనే, నాకు పెళ్లవుతుందని ఇప్పుడు నమ్మకం కుదిరింది.' అంటూ రామశర్మకు సాష్టాంగ నమస్కారం చేశాడు జయసింహుడు.

'ఇంతకూ నువ్వు ప్రేమించిన అమ్మాయి ఎవరు?' అని అడిగాడు జయసింహుడు.

'నేను ప్రేమించినది మరెవ్వరినో కాదు. మీ రెండో అమ్మాయి కావేరిని!' అని చెప్పాడు జయసింహుడు.

'అరి పిడుగా! నన్నే బోల్తా కొట్టించావే,' అంటూ రామశర్మ, జయసింహుడి భుజం తట్టి, తనను ఎంతో చాకచక్యంగా ఇరకాటంలో పెట్టి, సంబంధం కుదుర్చుకున్న జయసింహుడే తగిన వరుడని అతడికి తన కుమార్తెనిచ్చి పెళ్లి చేశాడు.





# శిథిలాలయం - 14

(పులిబోను దగ్గిర కాపలా వేసి శిఖిముఖి, చెంచుదయ్యాలపోతును పట్టుకున్నాడు. ఈ లోపల నాగుమల్లిని చెంచువాళ్లు ఆకాశ గుహకు తీసుకుపోయారు. దయ్యాలపోతు ప్రాణభయం కొద్దీ శిఖిముఖికి ఆకాశగుహ దగ్గిర సాయపడతానని మాట ఇచ్చాడు. బోనులో పడిన పులిని తాళ్లసాయంతో శబరులు ఈడ్చుకుపోసాగారు. తరవాత--)

శిఖిముఖీ, విక్రమకేసరుల వెనకగా నడుస్తున్న శబరులూ, సవరలూ, పులిబోను దగ్గిరకు రాగానే, దాని చుట్టూ మూగారు. వాళ్లలో ఒకరిద్దరు ఈటెలతో దాన్ని బెదర కొట్టబోయేసరికి, పులి రెచ్చిపోయి పంజాలు బయటకు చాచి పెద్దగా గాండ్రించ సాగింది. శిఖిముఖి వాళ్లను వారించి పులిని ఓసారి పరీక్షగా చూసి, తన భుజం మీద ఉన్న పులి చర్మాన్ని దానికేసి ఊపాడు. వెంటనే పులి బోనుమూలకు వెళ్లి గుర్రుపెడుతూ వెనక కాళ్లమీద కూర్చున్నది.

'పులినే భయపెట్టే ఈ పులిచర్మంతో మనం చాలా చాలా ఘనకార్యాలు చేయవచ్చు. నా అనుమానం చెంచు దయ్యాలపోతు దీన్నేదో మంత్రించాడని,' అన్నాడు శిఖిముఖి పెద్దగా నవ్వుతూ.

విక్రమకేసరి, శిఖిముఖి చేతిలో ఉన్న కపాలాన్నీ, పులిచర్మాన్నీ ఓ మారు తాకి చూసి, ముఖంలో లేని బాధ కనబరుస్తూ, 'వీటిని అంటుకుంటే నిప్పును అంటుకున్నట్టుగా చెయ్యి చుర్రుమన్నది. ఈ దయ్యాల పోతూ, శిథిలాలయ పూజారంత గొప్ప మంత్రగత్తెలా ఉన్నాడు,' అన్నాడు. అతడి మాటలకు అనుచరులందరూ పొట్టలు చెక్కలయ్యేలా నవ్వారు.

తరవాత అందరూ అరణ్యమార్గాన కొంత దూరం పోయి, లోయలో నుంచి ఉన్న కాలిబాటల వెంట కొండపై నున్న గుహప్రాంతా

దాసరి సుబ్రహ్మణ్యం

నికి నడవసాగారు. పులిబోనును మిట్ట పైకి ఎక్కించటం శిఖిముఖి అనుచరులకు కొంత శ్రమగానే ఉన్నది. కాని ఈ పులి ద్వారా తమ కులపెద్ద కొడుకు ఏదో సాహసకార్యం చేయ బోతున్నాడని ఊహించి వాళ్లు ఉత్సాహంగా బోనును పైకి లాక్కుసాగారు. పులి చాలా సేపు గాండ్రించి, ఓపిక పోయి కొంతా, పరిసరా లకు అలవాటు పడి కొంతా -- శాంతించి బోనులో ఒక మూల నక్కి కూర్చున్నది.

ఆకాశగుహ ప్రాంతం చేరగానే శిఖిముఖీ, విక్రమకేసరులు తమ అనుచరుల్ని రెండు ముఠాలుగా విభజించారు. ఒక ముఠా వాళ్లు తాము కొండ ఎక్కి వచ్చిన మార్గం నుంచి చెంచులు లోయలోకి పారిపోకుండా కాపలా కాయాలి. రెండవ ముఠా వాళ్లు చెంచు గూడెం చుట్టూ ఉన్న కంచె దగ్గిర ఉండి, పరిస్థితుల్ని బట్టి లోపలికి దూకటమో లేక అక్కడే ఉండి, బయటికి వచ్చే చెంచుల్ని బెదరకొట్టటమో చేయాలి. నాగుమల్లి తమ వశం అయేవరకూ, చెంచుల్తో ముఖాముఖి పోరు లేకుండా చూడాలని శిఖిముఖి అందర్నీ హెచ్చరిం చాడు. పులిబోను కంచె దగ్గిరగా ఉంచబ డింది.

చెంచు గూడెంలో అంతా కలిసి నలభై యాభై గుడిసెల కంటే ఎక్కువ ఉండవు. వాటి చుట్టూ అయిదారడుగుల కంచె, బల మైన కర్రలతో కట్టినది ఉన్నది. కంచె అవతల అక్కడక్కడా ఎత్తుగా పెరిగిన కొన్ని చెట్లు న్నవి. వాటి కొమ్మలు కంచె మీదుగా వాలి, గూడెంలోకి దిగేందుకు అనువుగా ఉన్నవి. శిఖిముఖీ, విక్రమకేసరీ అలాంటి చెట్టునొ కదాన్ని ఎక్కి, కొమ్మమీద కూర్చుని గూడెంలో రేగే కోలాహలానికి కారణం ఏమిటా అని



చూడసాగారు. బడేచెంచు నివసించేదీ, మామూలు గుడిసెలాంటిది కాదు. ఒక పెద్ద కొండ గుహను అతడూ, అతడి కుటుంబం ఇల్లుగా వాడుకుంటారు.

ఆ గుహ పక్కల, పైనా నున్నం పులిమి వాటిమీద రంగులతో రకరకాల బొమ్మలూ అవీ చిత్రించారు. ఆ గుహముందున్న ఖాళీ జాగాలో పెద్ద పెద్ద నెగళ్లు మండుతున్నవి. వాటి చుట్టూ చెంచు స్త్రీలూ, పురుషులూ చేరి పాడుతూ, నాట్యాలు చేస్తున్నారు.

సమీపంలో ఒక ఎత్తయిన కొయ్యదుంగ మీద కూర్చుని శిథిలాలయ పూజారి ఇదంతా చూస్తున్నాడు. బడేచెంచు కొంచెం దూరంలో నిలబడి దయ్యాలపోతుతో ఏదో మాట్లాడు తున్నాడు.

'శిఖీ, ఇదా ఆకాశగుహ? పేరు గొప్పగానే ఉంది! ఈ గొడవంతా ఏమిటి?' అని అడి గాడు విక్రమకేసరి, శిఖిముఖిని.




జాగ్రత్తగా గుడిశె దగ్గిరకు పోయి ద్వారానికి అడ్డంగా ఉన్న వెదురు తడికను తోసి, ఓ క్షణకాలం లోపల ఏమయినా అలికిడి అవుతుందేమో అని విని, అలాంటిదేమీ లేకపోవడంతో లోపల ప్రవేశించాడు.

గుడిశెలో ఎవరూ ఉన్నట్లు లేదు. అంతా చీకటి మయంగా ఉన్నది. శిఖిముఖి తన దగ్గిరున్న చెకుముకిరాయి కొట్టి దూది అంటించి, ఆ వెలుగులో గుడిశె అంతా పరీక్షించి చూశాడు. గుడిశెలో ఒక మూల అతడికి రెండు మూడడుగుల పొడవున్న తాళ్లు కనిపించినై. వాటిని పరీక్షించి చూసిన మీదట, అవి నాగుమల్లిని బంధించేందుకు చెంచు వాళ్లు ఉపయోగించినవని అతడికి అర్థమైపోయింది.

అంటే.. నాగుమల్లిని కొంత కాలం వాళ్లు ఈ గుడిసెలోనే ఉంచారన్నమాట. ఇప్పుడామెను ఎక్కడికి తీసుకుపోయి ఉంటారు? తనకు వాగ్దానం చేసిన విధంగా నాగమల్లిని కంచెద్వారం దగ్గిర గుడిశెలో దాచిన దయ్యాల పోతు, మళ్ళీ ఏ కారణం వల్ల ఆమెను మరో చోటుకు మార్చాడు?

శిఖిముఖి ఇలా ఆలోచిస్తూ కాలం వృథా చెయ్యటం ప్రమాదకారణం అవుతుందనుకుంటూ, తిరిగి విక్రమకేసరి ఉన్న చోటుకు వచ్చి, తాను చూసినది అతడికి చెప్పి, 'మనల్ని చెంచుదయ్యాలపోతు మోసం చేయటమో లేక అతణ్ణి మరొకడు మోసం చేయటమో జరిగింది,' అన్నాడు.

'అలా అయితే మనం అందరం ఒక్క సారిగా కంచె దూకి పోయి చెంచుల్ని హతమార్చి, నాగుమల్లిని వాళ్లే గుడిశెలో దాచారో వెతికి పట్టుకుందాం, అన్నాడు' విక్రమకేసరి.

'ఏదో జాతర! మనం ఇక్కడికి చేరేసరికి గూడెం అంతా సద్దుమణిగి ఉంటుందనుకున్నాను. నా పథకం అంతా పాడయింది. చెంచు దయ్యాలపోతు నేను చెప్పిన చోట నాగుమల్లిని ఉంచాడో లేదో చూసి వస్తాను,' అంటూ శిఖిముఖి కొమ్మ మీంచి దిగి, కంచె ద్వారం కేసి వెళ్లాడు.

కంచె ద్వారం మూసివున్నది. కాని, శిఖిముఖి దాన్ని గట్టిగా రెండు చేతులతో పట్టి తోసేసరికి కొంచెంగా తెరుచుకున్నది. అతడు ఆ ఖాళీలోంచి లోపలికి పోయాడు. అక్కడికి దాపులనే ఒక చిన్న గుడిసెలాంటి చుట్టిల్లు అతడి కంటబడింది. లోపల వెలుగు లేదు. దాని ముందు కాపలా వాడెవడూ అతని కంటబడలేదు.

అంతకు ముందు చెంచు దయ్యాల పోతు అన్నమాట ప్రకారం ఇందులోనే, నాగుమల్లిని ఉంచి ఉంటాడని శిఖిముఖి




శిఖిముఖి ఒక క్షణం ఆలోచించి, 'కేసరీ, నువ్వు చెప్పింది బాగానే ఉంది కాని, చెంచుల్ని అంత తేలిగ్గా లొంగదీయటం సాధ్యమని నాకు తోచడం లేదు. వాళ్లు సంఖ్యలో మనకన్న కాస్త ఎక్కువే ఉంటారు. పైగా, మనం వాళ్ల మీద దాడి ప్రారంభించగానే, వాళ్లలో కొందరు నాగుమల్లిని మరెక్కడికైనా ఎత్తుకుపోయి దాయొచ్చు. నేను లోగడే ఒక పథకం వేసి ఉంచాను గదా,' అంటూ కేసరికి పులి చర్మం, కపాలం చూపించాడు.

'ఏం చెయ్యబోతున్నావు? ఏమిటా పథకం?' అన్నాడు విక్రమకేసరి.

'ముందుగా మనం ఈ కంచెలోంచి పులి లోపలికి పోగలిగినంత దారి ఒకటి ఏర్పరిచి, దాన్ని బోనులో నుంచి సరైన సమయంలో బయటికి వదిలేందుకు సిద్ధంగా ఉండాలి. ఈ లోపల నేను లోపలికి పోయి నాగుమల్లిని వాళ్లు ఎక్కడ దాచారో తెలుసుకునేందుకు ప్రయత్నిస్తాను. ఇక చెంచును రహస్యంగా దొరకపుచ్చుకోగలిగితే, వాణ్ణించి ఆ రహస్యం లాగవచ్చు,' అన్నాడు శిఖిముఖి. 'నువు ఒంటరిగా పోవటం ప్రమాదం అవుతుందేమో!' అన్నాడు విక్రమకేసరి.

'అలాంటి భయం ఏమీ లేదు. ఈ పులి తోలూ, కపాలం ఉన్నవి కదా? ఏం జరుగుతుందో నువ్వే చూద్దువు గాని, ఈ లోపల నువ్వు పులిబోను ముందు కంచె నరికించి, దాన్ని చెంచుల మీదికి వదిలేందుకు సిద్ధం చెయ్యి. నేను కపాలాన్ని చెంచుల మీదికి విసిరివేయడమే అందుకు హెచ్చరిక,' అని చెప్పాడు శిఖిముఖి.

విక్రమకేసరి సరేనని తన అనుచరుల దగ్గిరకు పోయి, పులిబోను ముందున్న కంచెకర్రలను కింది నుంచి మూడు నాలుగడుగుల ఎత్తువరకూ నిశ్శబ్దంగా నరికివెయ్యమన్నాడు.

ఈ లోపల శిఖిముఖి కొమ్మల మీదినుంచి లోపలికి దిగి, చీకటి ప్రాంతాల్లో నక్కుతూ గుడిశెల కేసి పోసాగాడు. హఠాత్తుగా అతడికి తానింతకు ముందు చూసిన చీకటి గుడిశె ముందుకు ఒక చెంచు చిన్న దివిటీ తీసుకుని రావడం కనిపించింది.

దివిటీతో వచ్చిన చెంచు గుడిశె ద్వారానికి అడ్డంగా ఉన్న తడికను తోసి లోపలికి వెళ్లాడు. చెంచువాడు దివిటీతో లోపల అంతా వెతికి ఆశ్చర్యపడుతున్నవాడిలా కళ్లింత చేసి ఏదో గొణగసాగాడు. శిఖిముఖికి వాడు అక్కడికి రావడం నాగుమల్లి కోసమన్న అనుమానం కలిగింది. వెంటనే అతడు పిల్లిలా నిశ్శబ్దంగా వెనకనుంచి చెంచువాడి మీదికి ఎగిరి, వాడి కంఠాన్ని ఎడమచేత్తో వెనక్కి విరిచిపట్టుకుని,

కుడిచేత్తో నోరు మూసి 'బతకదలిస్తే అర వకు!' అన్నాడు బుసకొడుతున్నట్టు.

చెంచువాడి చేతిలోంచి దివిటీ కింద పడి పోయింది. విడిపించుకునేందుకు వాడే మాత్రం పెనుగులాడకుండా, శవంలా బిగ దీసుకుపోయాడు. శిఖిముఖివాడి మెడపట్టు వదిలి, చిన్న గొంతుతో, 'నువ్విక్కడికెందుకు వచ్చావు?' అని ప్రశ్నించాడు.

చెంచువాడు కళ్లింత చేసి, ఏదో భూతాన్ని చూసినట్టుగా శిఖిముఖి కేసి ఓమారు చూసి వణికిపోతూ, --'సవర నాగుమల్లిని మా బడేదొర తీసుకురమ్మన్నాడు. అందుకోసం వచ్చాను,' అన్నాడు.

'నాగుమల్లిని ఇక్కడ దాచినట్టు మీ దొరకు ఎవరు చెప్పారు?' అని ప్రశ్నించాడు శిఖి ముఖి. 'భూతాల దొర!' అన్నాడు చెంచు.

'మరి నాగుమల్లి ఏమయింది? నిజం చెప్పు. అబద్ధమాడావో చంపేస్తాను,' అంటూ శిఖిముఖి నడుం నుంచి వేలాడుతున్న చుర కత్తిని పైకెత్తాడు.

'నన్ను చంపకు దొరా! నేను బడేచెంచు మనిషిని కాదు, భూతాల దొర సొంత నౌకర్ని. ఆయన నాచేతే ఆ మల్లిని ఇక్కడ రహస్యంగా దాయించి, కంచె ద్వారాన్ని ఊరికే దగ్గిరకి చేరవేసి ఉంచమన్నాడు. చెప్పినట్టే చేశాను,' అన్నాడు చెంచు.

'భూతాల దొర ఇలా ఎందుకు చేశాడో తెలుసా?' అని అడిగాడు శిఖిముఖి.

'బాగా తెలీదు.సవరమల్లిని, ఆకాశ దేవ రకి పూజారిణ్ణి చేయబోతున్నానని అన్నాడు. ఆ మాట ఎవళ్లతో అనొద్దన్నాడు. నే చెప్పేదంతా నిజం, నన్ను చంపకు, దొరా!' అంటూ చెంచు శిఖిముఖి కాళ్లమీద పడబోయాడు.

శిఖిముఖి వాణ్ణి వారించి, 'అయితే పో, నన్ను చూసిన సంగతి మాత్రం ఎవరితోనూ అనకు జాగ్రత్త!' అని హెచ్చరించాడు.



చెంచు వెళ్లిపోయాడు. శిఖిముఖి పులి తోలు మీద కప్పుకుని, కాళ్లమీద చేతుల మీదా నడుస్తూ, ఆకాశగుహకు దాపుల ఉన్న గుడిశెల కేసి బయలుదేరాడు. అంతలో బడేచెంచు వాళ్లున్న ప్రాంతాన పెద్ద గలభా లేచింది.

శిఖిముఖి చీకటి మాటున దాగుతూ అటు వెళ్లేసరికి, చెంచు దయ్యాలపోతూ, శిథిలాలయ పూజారీ తగువులాడుతున్నట్టు మాట్లాడుకుంటున్నారు. వాళ్లిద్దరి పక్కనా బడేచెంచు, 'మోసం! మోసం!' అంటూ కేకలు పెడుతున్నాడు.

అసలీ గొడవకంతకూ కారణం తెలుసుకుందామన్న ఆదుర్దాలో శిఖిముఖి మరి కాస్త ముందుకు పోయేసరికి, అతడి మీద సెగళ్ల వెలుగు పడింది. వెంటనే ఒకరిద్దరు చెంచులు 'పులి! పులి!' అని అరిచారు. బడే చెంచూ, దయ్యాలపోతూ, పూజారీ చప్పున కదిలి ఆకాశగుహకేసి పరుగెత్తారు. వాళ్లని ఈటెతో కొట్టాలనే ఉద్రేకంలో శిఖిముఖి లేచి నిలబడ్డాడు. పులి చర్మం జారి కిందపడింది. పారిపోయే చెంచులు అది చూసి, 'పులి కాదు మనిషి!' అంటూ వెనుదిరిగి శిఖిముఖి కేసి రాసాగారు.

శిఖిముఖి ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ, ఈటె పైకెత్తి కంచె కేసి బయలు దేరాడు. చెంచుల కేకలు విన్న బడేచెంచూ వాళ్లు తిరిగి సెగళ్ల దగ్గిరకు పరుగెత్తుకు వచ్చారు. శిథిలాలయ పూజారి పట్టరాని కోపంతో పళ్లు కొరికి, 'ఆ పులివేషగాడెవరో నాకు తెలుసు! ప్రాణాలతో పట్టుకోండి!' అంటూ హుంకరించాడు.

చెంచువాళ్లు ఈటెలు తీసుకుని శిఖిముఖి కేసి రాసాగారు. ప్రమాదం రానున్నదని గుర్తించిన శిఖిముఖి కపాలాన్ని పూజారి మీద పడేలా విసిరి, పెద్దగా ఒక కేక పెట్టాడు. మరుక్షణంలో, విక్రమకేసరి బోనులో నుంచి వదిలిన పులి పెద్దగా గాండ్రిస్తూ, శిథిలాలయ పూజారీ వాళ్లున్న వైపుకు దూకింది.

'పారిపోకండి, మరొక పులివేషగాడు. చంపండి!' అంటూ శిథిలాలయ పూజారి కేకలు పెట్టాడు. పులి ఎదురైన ఇద్దరు చెంచుల్ని పంజాతో కొట్టి బడేచెంచూ, పూజారీ ఉన్న దిశకు కుప్పించి దూకుతూ పోసాగింది. (ఇంకా ఉంది)






# బహుమతి

నిర్మల్, రమేష్ మంచి స్నేహితులు. గురుకుల పాఠశాలలో చదువుకుంటూ అక్కడ హాస్టల్లో ఉంటున్నారు. వాళ్ళిద్దరికీ ఫుట్‌బాల్ అంటే చాలా ఇష్టం.

రోజూ వాళ్లచేత ఫిజికల్ ఎడ్యుకేషన్ మాస్టారు బాగా అభ్యాసం చేయిస్తూంటారు. ఆయనంటే విద్యార్థులందరికీ ఎంతో ఇష్టం.

ఆ రోజు సాయంత్రం తనని చూసి పరిగెత్తుకొచ్చిన వాళ్లిద్దరినీ చూసి మాస్టారు అడిగారు.

'నిర్మల్, రమేష్.. ఏంట్రా అంత ఆయాసపడుతూ పరిగెత్తుకొచ్చారు?'

'మాస్టారూ! ఇవాళ మాతో ఫుట్‌బాల్ మ్యాచ్ ఆడిస్తామని చెప్పారు కదా!' అన్నాడు నిర్మల్.

రమేష్ అక్కడ ఉన్న బయటి కుర్రాళ్లకేసి చూస్తూ.. 'ఈసారి మా హాస్టల్ జట్టు తప్పకుండా గెలుస్తుంది మాస్టారూ!' అన్నాడు గర్వంగా.

అయితే ఆ రోజు మాస్టారు ఏదో ఆలోచనలో పడ్డారు. 'సరే ఆడతారు.. మీరు గెలుస్తారు.. తర్వాత మీ ఒంటికి మట్టి, చెమట పడతాయి. మళ్లీ రాత్రి చదువుకోవడానికి వెళ్లేముందు ఏం చేస్తారు?' అని అడిగారు.

రమేష్ నవ్వుతూ 'మీరెందుకు అడుగుతున్నారో మాకు తెలుసు మాస్టారూ! చక్కగా స్నానం చేసి చదువుకుంటాంలెండి,' అన్నాడు.

'అందుకు నీళ్లు ఉండాలిగా రమేష్!' అన్నారు మాస్టారు.

'అదేంటి మాస్టారు!'

పి.వి. శేషారత్నం

మాస్టారు హాస్టల్‌లో ఓ వైపు చూపించారు. 'అదిగో అటు చూడండి. మీ స్నానపుగదుల తూముల్లోంచి అన్ని నీళ్లు వస్తున్నాయంటే మీరు నల్లాలు సరిగ్గా కట్టలేదనేగా అర్థం?' అన్నారు. 'రోజూ అలా వదిలేస్తూనే ఉంటారు. నీటి బిల్లు ఎక్కువవుతోందని వార్డెన్ మందలిస్తూనే ఉంటారు' అన్నాడు నిర్మల్ నిర్లక్ష్యంగా.

'ఇది ఏ ఒక్కరి బాధ్యతో కాదు నిర్మల్. ఉమ్మడి బాధ్యత. మన దేశంలో నీటి లభ్యత కంటే వృధా చెయ్యడమే ఎక్కువ తెలుసా?' మాస్టారి మాటలకు రమేష్ తలవంచుకుంటూ, 'మాది తప్పే మాస్టారూ! ఇంకెప్పుడూ ఇలా చెయ్యం,' అన్నాడు.

'నేనన్నానని కాదు రమేష్! ఇక్కడ కిటికీల్లోంచి మీరు విసిరేసిన చెత్త కాగితాలు ఇరుక్కుపోయి మురుగు నిలిచిపోవడానికీ మీరే కారణం అవుతున్నారు. హాస్టల్లో ఆ మధ్య ఒక్కసారిగా అందరికీ అతిసారం, మలేరియా జ్వరం చుట్టుముట్టడానికి ఈ మురుగే కారణమని ఇప్పటికయినా అర్థమయిందా?' అన్నాడు.

ఆడుకోవడానికి వచ్చిన బయటి విద్యార్థులలోంచి సుభాష్ అనే కుర్రాడు వెంటనే 'మాస్టారూ! మేం ఉండే గల్లీలోనూ మొన్నటి దాకా ఇదే సమస్య.. కానీ మేమే వాటిని శుభ్రం చెయ్యడం చూసి మా గల్లీవాళ్లు చాలా మారిపోయారు,' అనే సరికి మాస్టారి ముఖంలో ఆనందం తళుక్కుమంది.

'నా పుట్టిన రోజున ఒక మంచి మాట విన్నందుకు నాకెంతో సంతోషంగా ఉందర్రా!' అన్నారాయన.



కుర్రాళ్లంతా ముక్త కంఠంతో మాస్టారిని అభినందిస్తూ.. 'నిజంగానా, అయితే జన్మ దిన శుభాకాంక్షలు మాస్టారూ!' అన్నారు.

మాస్టారు నవ్వుతూ.. 'థ్యాంక్యూ, మరి నాకేం పార్టీ ఇస్తారు?' అన్నారు రమేష్, నిర్మల్‌లకేసి వారగా చూస్తూ... దాంతో వాళ్లిద్దరికీ మాస్టారి అంతరంగం అర్థమ యింది. 'ఇక మీదట మన పాఠశాల హాస్టల్లో ఎప్పుడూ నీళ్లు వృధా అవనివ్వమని ప్రతిజ్ఞ చేస్తున్నాం మాస్టారు!' అన్నారు ఏకకంఠంతో.

మాస్టారు బయటి విద్యార్థి అయిన సుభాష్‌కేసి చూస్తూ... 'ఇక్కడే కాకుండా రోజూ బయట నుంచి వచ్చే పిల్లలు లంచ్ బాక్సులు కడుక్కునే చోట కూడా నీరు ఎంతో వృధా అవుతోంది. అక్కడినుండీ, ఇక్కడినుంచీ మన బడితోటలోకి ఆ నీరు మళ్లేందుకు ఇవాళ నేను స్వయంగా కాలు వలు తీద్దామనుకుంటున్నాను' అన్నారు అందుకు ఉపక్రమిస్తూ...

సుభాష్, రమేష్ వారించారు.. 'మేం ఒప్పుకోం.. అది మా పని,' అన్నారు.

'ఇంతకాలం నీరు వృధా చేసిన మీకు నచ్చచెప్పనందుకు ఇది నా బాధ్యత కూడా. అందుకే ఈ పనిని వాయిదా వెయ్యకుండా, ఇప్పుడే నేను మాత్రమే చేసి మన బడి తోటలో ఎక్కువ కూరగాయలు పండేలా చెయ్యడమే మీకు నేనిచ్చే చాక్లెట్లు..'

మాస్టారి మాటలకు అంతా చప్పట్లు కొడుతూ.. 'మేము సైతం ఈ పనిలో మా చేతులు కలుపుతాం.. దయచేసి కాదనకండి మాస్టారూ...' అని బ్రతిమాలాడేసరికి మాస్టారు ఆనందంగా తలూపారు.

'మీలాంటి విద్యార్థులు అందరూ మేము సైతం అంటూ నడుం బిగిస్తే పర్యా వరణాన్ని కాపాడటం చిటికెలో పని. అంత కంటే నాకు పుట్టినరోజు బహుమతి ఏముం టుంది' అంటూ.. మాస్టారు వాళ్ల భుజాలు తట్టారు ప్రేమగా.



# కౌమార్యదశ

## తరుణ వయస్సు

ప్రియమైన చిన్నారులకు,

మన గత సంచికలో, ప్రపంచ బాలల నివేదిక 2011 స్థితిపై సమాచారాన్ని పంచుకున్నాము. ఈ సంచికలో కౌమార్య దశలోని అంటే పది నుంచి పందొమ్మిదేళ్ల వయస్సు పిల్లలకు సంబంధించిన కథలను తీసుకువస్తున్నాము. వీరిలో చాలామంది మీ వయస్సు వారే. వాళ్లు ఎదుర్కొంటున్న సవాళ్లు, వాటిని వారు అధిగమించిన తీరు, క్రీడలు ప్రత్యేకించి క్రికెట్.. దేశంలో వ్యత్యాసాలను ఎలా సమంచేస్తోంది వంటి విషయాలను మీరు నేర్చుకుంటారు. మీరు ఈ కథనాలను ఆస్వాదిస్తారని ఆశిస్తూ మీ స్పందనలకోసం ఎదురు చూస్తుంటాము. - మీ దీదీ



## గ్రామాలకు కొత్త జీవితాన్ని అందిస్తున్న నర్సులు

ఝాగర్, ఇండియా, 8 మార్చి 2011 - నర్సు సంజు కైమ్ ఉద్యోగంలో చేరిన మొదటిరోజే చిన్న బోనస్ అందుకున్నారు. ఆ ఉదయం ఆమె కవలపిల్లలకు పురుడు పోశారు. ఝాగర్ గ్రామంలోని ఆరోగ్య కేంద్రంలో సహాయక మంత్రసానిగా చేరుతున్నట్లు నివేదించడానికి ఆమె ఆ సమయంలో ప్రసూతి వార్డులో ఒంటరిగా కూర్చుని ఉంది.

23 ఏళ్ళ సంజు అంతకుముందు బ్యూటీ పార్లర్‌లో సహాయకురాలిగా కొద్దికాలం పనిచేసింది. కాని ఇప్పుడిక్కడ యువ మాతృమూర్తుల ఆరోగ్యం మరియు సంరక్షణ బాధ్యతలు చేపట్టింది. తల్లులు ఈ ప్రపంచంలోకి కొత్త ప్రాణిని తీసుకురావడానికి పూర్తిగా ఈ యువ మంత్రసానిమీదే ఆధారపడుతున్నారు.

'పురుడు పోసే పని చేపట్టాలంటే చాలా కష్టపడి చదవాల్సి ఉంటుందని నాకు తెలుసు. ఈ

ఉద్యోగం చేయడానికి పూర్తిగా సిద్ధపడే వచ్చాను' అని సంజు గుర్తు చేసుకుంది. అయితే తొలి రోజే పురుడు పోయవలసి వచ్చినప్పుడు చాలా ఆందోళన పడ్డానని ఆమె ఒప్పుకుంది.

పురిటినొప్పులతో బాగా ఇబ్బంది పడుతున్న ఒక మహిళ ఆరోజు జనని ఎక్స్‌ప్రెస్ (ప్రసూతి ఎక్స్‌ప్రెస్)కు వచ్చింది. ఇది 24 గంటలూ అందుబాటులో ఉండే జిల్లా ఉచిత మినీ వ్యాన్ సర్వీస్. అప్పటికే ఆ మహిళ తన గ్రామంనుండి రతానగర్ పట్టణానికి 20 కిలోమీటర్లు ప్రయాణించి రావడంతో నొప్పితో విలవిలలాడుతోంది. ప్రసూతి కేంద్రానికి వచ్చే సమయానికి ఆమె పొట్ట ఉబ్బిపోయిందని సంజు చెప్పింది. ఆ మహిళను వెంటనే ప్రసూతి గదికి తీసుకుపోయారు. కొద్ది క్షణాల్లోనే సంజు ఇద్దరు పాపలకు పురుడుపోసింది. 'వారికి పురుడు పోసినందుకు నాకు చాలా సంతోషమేసింది.' అని సంజు చెప్పింది. ఈ యువ మంత్రసాని ఇప్పటికే 600మంది పిల్లలకు పురుడు పోసినంత ధీమాతో మాట్లాడుతోంది. 'ఈ రంగంలోకి వచ్చినందుకు నేను బాధపడలేదు పిల్లలకు, వారి తల్లులకు సహాయపడటం చాలా మంచిపని కదా. తల్చుకుంటుంటేనే నాకు ఎంతో గర్వమేస్తుంటుంది.' అంటుందీమె.

ఇప్పుడు 24 సంవత్సరాల వయసున్న సంజు, గత సంవత్సరం 200మంది పిల్లలకు పురుడు పోసింది. మధ్యప్రదేశ్‌లో వృత్తిని గౌరవిస్తున్న అనేకమంది యువ మంత్రసానులలో ఆమె ఒకరు. భారతదేశంలోనే శిశు, ప్రసూతి మరణాల సంఖ్య ఎక్కువగా నమోదవుతున్న రాష్ట్రాలలో మధ్య ప్రదేశ్ ఒకటి. ఇప్పుడు UNICEF మద్దతుతో రాష్ట్ర ప్రభుత్వం 24 గంటలూ పనిచేసే ఆరోగ్య ఉప కేంద్రాల యంత్రాంగాన్ని సృష్టించింది. ఈ కేంద్రాలు మారుమూల పల్లెల్లోని మహిళలకు సురక్షితమైన ప్రసూతి సేవలను అందిస్తున్నాయి. ఇవి లేకపోతే ఇంట్లోనే ప్రసవించవలసిన మహిళలు తీవ్ర ప్రమాదంలోకి నెట్టబడేవారు.

ఇక్కడికి కొన్ని కిలోమీటర్ల దూరంలోని ఫతేఘర్ గ్రామంలో మరొక ఆరోగ్య ఉప కేంద్రం ఉంది. దీంట్లో నిరంజన పరిహార్ అనే ఆమె నర్సుగా పనిచేస్తోంది. ఈమె ఇటీవలే పనాబాయ్ సహారియా అనే 20 ఏళ్ల కొత్త మాతృమూర్తికి పురుడు పోసింది.

ఈ ఉప కేంద్రంలో పని చేయడానికి వచ్చినప్పుడు నిరంజన వయస్సు 21 సంవత్సరాలు మాత్రమే. ఇది రాష్ట్రంలోని మారుమూల కేంద్రాల్లో ఒకటి. ఇక్కడ సినిమా హాళ్లు ఉండవు, పైగా ఈమె కుటుంబానికి కూడా చాలా దూరంగా ఉండాలి. అయితే ఆమె తన పనిని ఎంతగానో ఆస్వాదిస్తుంది. పైగా 27 ఏళ్ల వయసున్న కమలా కైమ్ అనే తోటి నర్సు రూపంలో మంచి మిత్రురాలు, సహోద్యోగి కూడా ఆమెకు తోడుగా ఉంది.

'కేంద్రంలో పనిలోనూ, ఇంట్లో కూడా మేం పరస్పరం సహకరించుకుంటుంటాము. రోజూ టీవీ కార్యక్రమాలను లేదా నేను గీసిన చిత్రాలను కూడా కలిసే చూస్తుంటాము.' అన్నది నిరంజన చిరునవ్వుతో.

'ఈ కార్యక్రమాలను విజయవంతం చేయడంలో సంజు, నిరంజన వంటి యువ సేవా ప్రదాతలు కీలక పాత్ర నిర్వహిస్తున్నారు' అని డాక్టర్ టానియా గోల్డ్నర్ చెప్పారు. ఇతడు మధ్యప్రదేశ్ UNICEF కార్యాలయ అధిపతి. 'యువ మంత్రసానులు, నర్సులు పనిని వైవిధ్యంతో చేస్తుంటారు, ప్రసూతి మహిళలు, పిల్లలు కూడా చక్కగా మనుగడ సాగించేలా వీరు సేవలందిస్తున్నారు' అంటారీయన.

# హెచ్ఐవి బారిన పడిన పిల్లలతో ఐక్యమైన దక్షిణాఫ్రికా క్రికెట్ టీమ్



హెచ్ఐవి మరియు ఎయిడ్స్‌పై జాగరూకతను పెంచడం కోసం THINKWISE కేంపెయిన్‌లో భాగంగా హెచ్ఐవి ప్రభావానికి గురైన/దాని బారినపడిన పిల్లల బృందంతో దక్షిణాఫ్రికా క్రికెటర్లు.

– గీతాంజలి మాస్టర్

న్యూఢిల్లీ, ఇండియా, 10 మార్చి 2011 – న్యూఢిల్లీలోని ఫిరోజ్ షా కోట్లా మైదానం మంగళవారం మధ్యాహ్నం వైవిధ్యభరితమైన హరితచ్ఛాయతో మెరిసిపోయింది. గ్రేమ్ స్మిత్, వేని పార్నెల్‌తో సహా దక్షిణాఫ్రికా జట్టు సభ్యులు హెచ్ఐవి మరియు ఎయిడ్స్‌పై జాగరూకతను పెంచడం కోసం THINKWISE కేంపెయిన్‌లో భాగంగా హెచ్ఐవి ప్రభావానికి గురైన/దాని బారినపడిన పిల్లల బృందంతో క్రికెట్ ఆట ఆడుతూ గడపడంతో మైదానం సరికొత్త శోభను సంతరించుకుంది.

ఆ సందర్భంగా ఆశ్చర్యం గొలిపే హావభావాలు, నవ్వులు, ఆనందం మైదానంలోని ఖాళీ స్టాండ్ల గుండా ప్రతిధ్వనించాయి. ఎందుకంటే దక్షిణాఫ్రికా క్రీడాకారులు క్యాచ్ పట్టడం, బంతి విసరడం, ఫీల్డింగ్ వంటి క్రికెట్‌కి సంబంధించిన ప్రాథమిక సూత్రాలను ఈ పిల్లలకు నేర్పారు. ఆ సమయంలో అక్కడ చేరిన క్రీడాకారులు, పెద్దలు, పిల్లలు వీరిని చూసి కరతాళధ్వనులు చేశారు.

'నాకూ నా స్నేహితులకు అది కల నిజమైన చందంగా అనిపించింది. మన దేశంలో క్రికెట్ అంటే ఆరాధనా భావం ఉంది కదా. పైగా క్రికెటర్లు మనకు ఆదర్శప్రాయులు కూడా. ఓ మధ్యాహ్నం వేళ నేను దక్షిణాఫ్రికా క్రికెట్ టీమ్‌తో ఉల్లాసంగా గడిపాను అంటే ఇప్పటికీ నమ్మలేకపోతున్నాను,' అంటూ వారిలో ఒక పిల్లవాడు తన అనుభూతులను పంచుకున్నాడు.

ప్రత్యేకించి బాలికలయితే మరింత ఉద్వేగానికి గురయ్యారు. ఎందుకంటే ఆట నిబంధనలను అర్థం చేసుకునే అరుదైన అవకాశం వారికి ఇలా లభించింది. క్రికెట్‌ను మొదటిసారిగా ఆడుతున్నప్పటికీ ఈ బాలికలు తాము త్వరలోనే గేమ్ మూలసూత్రాలను పట్టుకుంటామని ఎంతో విశ్వాసం ప్రకటించడం గమనార్హం.

దక్షిణాఫ్రికా జట్టు క్రీడాకారులు కూడా పిల్లలకు ఆటలోని మెలకువలను నేర్పుతూ ఆ మధ్యాహ్నాన్ని సరికొత్త అనుభవంతో గడిపారు. 'బంతిని మొదట రెండు చేతులతో పట్టుకోండి, బంతిని విసిరేముందు, ఒక చేయి వికెట్‌కేసి గురిపెట్టేలా జాగ్రత్త వహించండి. తర్వాత బంతిని విసరండి, కొన్ని సార్లు మీరు విసిరిన బంతి వికెట్లను తాకవచ్చు కొన్నిసార్లు తాకకపోవచ్చు' అని దక్షిణాఫ్రికా క్రికెట్ జట్టు కోచ్ రిచ్చర్డ్ పైబస్ వివరించారు.

'హెచ్‌ఐవి నిజంగానే పెద్ద వ్యాధి, మా దేశం మరియు భారత్‌తో సహా ప్రపంచమంతటా ప్రజలు ఈ వ్యాధిబారిన పడుతున్నారు. భారత్‌లో హెచ్‌ఐవి వ్యతిరేక సందేశాన్ని ముందుకుతీసుకుపోయి బలోపేతం చేయడానికి ప్రపంచకప్‌ని ఒక మంచి అవకాశంగా ఇవ్వాళ మేమందరం భావిస్తున్నాము,' అని జట్టు కెప్టెన్ గ్రేమ్ స్మిత్ చెప్పారు.

'టోర్నమెంట్ పొడవునా ప్రజలను విద్యావంతులను చేయడం మా లక్ష్యం. హెచ్‌ఐవిని నివారించడం, హెచ్‌ఐవిని కలిగిన ప్రజలు సాధారణ జీవితాలను గడిపేలా చేయటమే ఈ లక్ష్యం. ఇది హెచ్‌ఐవి పట్ల సమాజంలో ఉండే అపవాదును తగ్గించడంలో తోడ్పడుతుంది.' అని చెప్పారు గ్రేమ్ స్మిత్.

UNAIDS మరియు UNICEFతో భాగస్వామ్యంలోకి వచ్చిన ఐసీసీ థింక్‌వైజ్ కార్యక్రమం ప్రధానంగా హెచ్‌ఐవి నివారణను ప్రోత్సహించడంపై దృష్టి పెట్టింది. హెచ్‌ఐవి ఇన్ఫెక్షన్‌ని నిరోధించడానికి తగిన చర్యలు తీసుకోవలసిందిగా యువతీయువకులకు సమాచారం పంపడానికి. హెచ్‌ఐవితో గడుపుతున్న ప్రజల పట్ల సమాజంలో ఉన్న అపవాదు, వివక్షతపై పోరాడడానికి ఈ కేంపెయిన్ తోడ్పడుతుంది.

## మూసిన తలుపులనుంచి పుట్టుకొచ్చినవారు

చంద్రాపూర్, ఇండియా, 25 ఫిబ్రవరి 2011 - భారత ఉపఖండం మధ్యభాగంలో, మహారాష్ట్ర రాష్ట్ర తూర్పు ప్రాంతంలో చంద్రాపూర్ జిల్లా ఉంది. ఇక్కడ మారుమూల గ్రామీణ ప్రాంతాల్లో జీవిస్తున్న గిరిజనులు రాష్ట్రంలో కెల్లా సామాజికంగా దూరంగా ఉంచబడిన కమ్యూనిటీలలో ఒకరు.

సాంప్రదాయికంగా, ఇక్కడి మహిళలు చాలా చిన్న వయసులోనే పెళ్లాడతారు. పైగా శారీరకంగా, మానసికంగా సిద్ధం కాకముందే వీరు పిల్లలను కంటుంటారు. ఇది వారి జీవితాలకే ప్రమాదకరంగా మారుతుంటుంది. కాని ఈ గ్రామాలలో కొన్నింటిలో పరిస్థితులు మారుతున్నాయి.



**Liked what you read? Send your comments / queries to**

Vibhavari
Sai Estate Colony, D.P.N Bhargav House,
Nanakhedi, Guna,
Madhya Pradesh Pin- 473001.

**Send us your feedback!**

CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
Phone : +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com



# స్నేహితుల కవిత్వం

ఒకానొక గ్రామంలో ముగ్గురు స్నేహితులుండేవారు. వారిలో వీర్రాజు అనే అతను నాస్తికుడు. అతడు గుడికి వెళ్లడు సరికదా, అలా వెళ్లేవాళ్లను వేళాకోళం చేసేవాడు. రామయ్య అనే అతను అన్నింటికీ దేవుణ్ణి నమ్ముకున్న ఆస్తికుడు.

తననెవరైనా వేళాకోళం చేసినా, ఆ పాపం వాళ్లనే కొడుతుందని సరిపెట్టుకుంటాడు. తప్ప గొడవపెట్టుకోడు. సూరన్న అనే అతనికి బాగా డబ్బుంది కానీ, పరమలోభి. పిల్లికి బిచ్చం పెట్టడు.

వీళ్లు ముగ్గురూ స్నేహితులు కావడం ఒక విశేషం. ఇంతకన్న పెద్ద విశేషమేమిటంటే – మహాలౌక్యుడని పేరుబడ్డ చలపతి అనే అతనికి, ఈ ముగ్గురితో స్నేహం కలవడం! మొత్తం నలుగురూ గ్రామం చివర మర్రిచెట్టుకింద ప్రతిరోజూ సాయంసమయంలో కలుసుకుని సాహిత్య గోష్ఠి చేస్తుంటారు. ఈ నలుగురికీ కూడా అంతో ఇంతో కవిత్వం చెప్పడం వచ్చు. కానీ వాళ్ల కవిత్వం వినే నాథులే కరువయ్యారు. వాళ్ల కవిత్వం వినడం పెద్ద శిక్ష అని అంతా చెప్పుకుంటారు.

వాళ్లు కవిత్వం నేర్చుకున్నందుకు రకరకాల కారణాలు గ్రామస్థులు హాస్యంగా చెప్పుకునేవారు. వాటిలో కొన్ని: వీర్రాజు నాస్తికుడు కదా, అందుకని భూత ప్రేత పిశాచాలు వచ్చి బాధిస్తే అతన్ని ఏ దేవుడూ రక్షించడు. మహామాంత్రికుడి శక్తికి బెదరని దయ్యాలు కూడా. వీర్రాజు కవిత్వం పేరు చెబితే, ఆమడ దూరం పారిపోతాయట.

రామయ్య పరమ ఆస్తికుడు కదా, అతను తన కవిత్వాన్ని దేవుడికి వినిపిస్తాడు.

వసుంధర

ఇలాంటి కవిత్వం చెప్పే వాణ్ణి క్షణం విడిచి పెట్టినా ప్రజలు బ్రతకనివ్వరని, ఎల్లకాలమూ దేవుడు అతణ్ణి అంటిపెట్టుకుని ఉంటాడట!

సూరన్న కవిత్వానికి భయపడి, మనుషులెవ్వరూ డబ్బు అవసరం అయినా సరే, అతడి దగ్గరకు వెళ్లరు. రోజూ కవిత్వం పారాయణం చేస్తూంటే, అతని ఇంట్లోంచి దోమలు, ఈగలు ఎలుకలు కూడా పారిపోతాయట!

ఇక చలపతి లౌక్యుడు కదా! వీళ్ల వల్ల ఎప్పుడో ఒకప్పుడు ప్రయోజనం ఉండక పోదని, వీళ్లతో స్నేహం చేశాడు. అందువల్ల అతడికి వీళ్ల కవిత్వం వినక తప్పలేదు. వీళ్లమీద ప్రతీకారం తీర్చుకునేందుకు, అతను కూడా క్రమంగా కవిత్వం చెప్పడం అభ్యసించాడట!

ఏది ఏమైతేనేం, ప్రతిరోజూ వీళ్లు నలుగురూ గ్రామం చివర మర్రిచెట్టు కింద చేరినప్పుడు, ఒకరి కవిత్వాన్ని ఒకరికి వినిపించుకుని, ఒకరినొకరు మెచ్చుకుంటుంటారు.

ఇలా ఉండగా, అక్కడి భాగ్యవంతుడొకాయనకు గొప్ప కవిపోషకుడిగా పేరు తెచ్చుకోవాలనిపించి, కవుల మధ్య పోటీ పెట్టాడు. పోటీలో చుట్టుపక్కల నుంచి రెండువందలమంది కవులు వచ్చి పాల్గొన్నారు.

భాగ్యవంతుడు, కవులు సమర్పించిన కావ్యాల్లోంచి అయిదు కావ్యాలను ఎన్నిక చేసి, వాటిని రచించిన కవులకు ఒక్కొక్కరికి వెయ్యేసి వరహాల చొప్పున బహుమతి ఇచ్చాడు. అలా బహుమతి పుచ్చుకున్న వారిలో చలపతి కూడా ఉన్నాడు.



పోటీలో పాల్గొన్న వీర్రాజు, రామయ్య, సూరన్నలకు ఏ బహుమతీ రాలేదు.

ఆరోజు నుంచీ వీర్రాజు, రామయ్య, సూరన్న ఒక్కటైపోయి, చలపతితో ముభావంగా ఉండసాగారు.

లౌక్యుడైన చలపతికది బాధగా అనిపించింది. వాళ్ల ముగ్గుర్నీ తిరిగి తనవాళ్లుగా తీసుకునేందుకు, అతడొక ఉపాయం ఆలోచించాడు.ఆ విధంగా, తన మిత్రులలోని లోపాలు కూడా సవరించుకోవచ్చునని అతనికి తోచింది.

ముందుగా చలపతి, వీర్రాజు వద్దకు వెళ్లి, 'నువ్వు నాస్తికత్వం విడిచిపెట్టు, దేవుణ్ణి నమ్ము. ఆయన దీవెనలుంటేనే నీకు గుర్తింపు వస్తుంది,' అన్నాడు.

తర్వాత రామయ్యను కలుసుకుని, 'నువ్వు పోటీలు నిర్వహించిన భాగ్యవంతుణ్ణి కూడా, దేవుడిలా భావించి గౌరవించి ఉంటే, నీ కావ్యానికి బహుమతి వచ్చి ఉండేది,' అన్నాడు.

ఆ తర్వాత సూరన్నతో, 'లోభితనం నీకు తగదు. భాగ్యవంతుడు కావ్యాల మంచి చెడ్డలను నిర్ణయించమని, ఒకణ్ణి నియమించాడు. అతడికి కాస్త డబ్బిచ్చి వుంటే నీ కావ్యానికి బహుమతి వచ్చి ఉండేదేమో!' అన్నాడు.

ఇది జరిగాక, ఆ ముగ్గురూ ఎంతో సంతోషంగా ఉండటం చలపతి గమనించాడు.అయితే. వాళ్లు తమ అలవాట్లను మాత్రం మానుకోవడం లేదని గ్రహించి, చలపతి ముగ్గుర్నీ విడివిడిగా మరొకసారి హెచ్చరించాడు.

ఎందుకంటే, చలపతి లౌక్యుడు కాబట్టి అతడికి చాలా మంది స్నేహితులున్నారు.



తన ముగ్గురు మిత్రులనూ, తనలాగే లౌక్యులుగా మార్చితే వాళ్లు సుఖపడతారని చలపతి తాపత్రయం.

అయితే, వీర్రాజు, చలపతితో, 'నీకు బహుమతి రావడానికి కారణం, దేవుణ్ణి నమ్మడమని తెలిశాక నాకెంతో సంతోషంగా ఉంది. మనుషుల మధ్య ఇన్ని తేడాలు సృష్టించిన ఆ భగవంతుడి సాయంతో కాక, నా స్వయంశక్తితోనే నేను బహుమతి సాధిస్తాను. నీలాగా విలువలేని కావ్యానికి బహుమతి రావాలని ఎన్నడూ తాపత్రయపడను. ఈ కోణంలో దేవుడు నాకెప్పుడూ శత్రువే!' అన్నాడు.

'నువ్వింకా గొప్పకావ్యం రాశావనుకుని చాలా అసూయపడ్డాను. చచ్చు కావ్యానికి బహుమతి రావాలని, మనుషుల్ని దేవుడిగా భావించి నేను ఎప్పుడూ కీర్తించలేదు. నిజంగా గొప్ప కావ్యం రాసినప్పుడే నాకు బహుమతి వస్తుందిలే,' అన్నాడు రామయ్య పెడసరంగా.

'నీలాగా డబ్బిచ్చి బహుమతులు కొనుక్కునే నీచులుండబట్టే, చెత్తకావ్యాలకు బహుమతులొస్తున్నాయి. న్యాయంగా అయితే నా కావ్యానికే బహుమతి వచ్చేదని, నువ్వు చెప్పింది విన్నాక అర్థమయింది!' అన్నాడు సూరన్న నిరసనగా.

స్నేహభావంతో తానిచ్చిన సలహాలలోని మంచిని తీసుకోకుండా, ఎప్పుడూ ఎదుటివారిలో చెడునే చూసేవారితో అంతకాలం పాటు స్నేహం చేసినందుకు చలపతి ఎంతగానో సిగ్గుపడ్డాడు.

తన కావ్యానికి బహుమతి వచ్చిందని దిగులుపడి, తన కావ్యాన్ని చిన్నబుచ్చి సంతోషపడేవాళ్లతో ఇక స్నేహం తగదని చలపతి వాళ్లకు దూరంగా దూరంగా ఉండసాగాడు.

అయితే వీర్రాజు, రామయ్య, సూరన్న మాత్రం యథాప్రకారం మర్రిచెట్టుకింద కలుసుకుంటూ సాహిత్య గోష్ఠి కొనసాగిస్తూనే ఉన్నారు.






# నిజం చెప్పిన బొమ్మ

రాజు, గిరి ఇద్దరూ ఆరో తరగతి చదువుతున్నారు. చదువులో ఇద్దరూ చక్కని ప్రతిభ కనబరుస్తూ, గురువులందరికీ ప్రీతిపాత్రులుగా ఉండేవారు. పరీక్షల్లో ఎక్కువగా రాజు ప్రథముడిగా నిలుస్తుండేవాడు. అందువల్ల తానే ప్రతిభావంతుడిననే గర్వం రాజులో పొడసూపింది. ఏదైనా పరీక్షలో గిరి ఎక్కువ మార్కులు సంపాదిస్తే రాజు ఓర్వలేకపోయేవాడు. గిరి ఎలాంటి అసూయా లేకుండా రాజుతో సఖ్యంగా మెలిగేవాడు.

ఇలా ఉండగా ఒకసారి వాళ్ల పాఠశాలకి కొత్తగా మాధవ్ అనే డ్రాయింగ్ మాస్టారు వచ్చారు. చిత్రలేఖనంలో చాలా మెళకువలు నేర్పించడమే గాక, చక్కని ప్రతిభ కనబరిచిన వారికి చిన్న చిన్న బహుమతులు కూడా ఇస్తూ ఆయన పిల్లలందరికీ ఆప్తుడయ్యాడు.

సహజంగానే బొమ్మలు గీయడంలో చక్కని నేర్పుగల గిరికి మాస్టారి మెళకువలు ఎంతగానో ఉపయోగపడేవి. మాస్టారి శిక్షణ వల్ల గిరి ఇంకా రాణిస్తూ అతని మెప్పు పొందడాన్ని చూసి ఓర్వలేక పోయేవాడు రాజు. ఎలాగైనా చిత్రలేఖనంలో గిరిని మించిపోయి, అతణ్ణి ఓడించాలని అనుకుంటూండేవాడు. ఈ విషయం మాస్టారి దృష్టిని దాటిపోలేదు.

ఒకరోజు మాస్టారు కొన్ని రంగుల పెన్సిల్ పెట్టెలు తీసుకొచ్చి తరగతిలో అందరికీ పంచిపెట్టారు. వాటితో బాటు డ్రాయింగ్ పేపర్ కూడా ఇచ్చి, తాజ్‌మహల్ బొమ్మ గీసి మరునాడు క్లాసుకి తీసుకురమ్మని చెప్పారు.

గిరిని డ్రాయింగ్‌లో అధిగమించాలనుకుంటున్న రాజుకి ఇదే మంచి అవకాశంగా తోచింది. ఇంట్లో ఆ రాత్రి వాళ్ల నాన్న చేత తాజ్ మహల్ బొమ్మ గీయించి, రంగులు నింపించి మర్నాడు తరగతి గదికి తీసుకెళ్లాడు. అది రాజు గీసిన బొమ్మే అనుకున్న పిల్లలందరూ అతణ్ణి చాలా మెచ్చుకున్నారు. గిరి గీసిన

మల్లారెడ్డి మురళీ మోహన్

తాజ్‌మహల్ చిత్రం కంటే రాజు చేతిలో ఉన్న డ్రాయింగ్ ఆకర్షణీయంగా ఉంది. రాజు మనసు ఉప్పొంగి పోయింది. గిరి కూడా రాజుని మనస్ఫూర్తిగా అభినందించాడు.

మాస్టారు వచ్చి పిల్లలందరి బొమ్మలూ పరిశీలించారు. వాటిలో గిరి బొమ్మ అన్నింటికంటే ఉత్తమమైనదిగా నిర్ణయించారు. పిల్లలందరూ ఆశ్చర్యపడ్డారు. రాజు మాత్రం ఉక్రోషం పట్టలేక, 'గిరి గీసిన బొమ్మ కంటే నా బొమ్మ బావున్నా అతనిదే ఉత్తమమైనదిగా నిర్ణయించడంలో మీరు పక్షపాతం చూపించారు మాస్టారూ!' అని ఆక్షేపించాడు.

అందుకు మాస్టారు, 'రాజూ, తాజ్‌మహల్ బొమ్మ మిమ్మల్ని గీయమని చెప్పాను గాని, మీ తల్లిదండ్రుల్ని కాదు. నిజం చెప్పు! ఇది నువ్వు గీసిన బొమ్మేనా?' అని తిరిగి ప్రశ్నించారు. 'క్షమించండి మాస్టారూ, మీరన్నట్లు నేను మా నాన్నగారి చేత బొమ్మ గీయించాను. అయినా ఆ విషయం మీరెలా పసిగట్టారు?' అని అడిగాడు రాజు ఒకింత ఆశ్చర్యంతో.

'నీవు తెచ్చిన బొమ్మలో గీతలు చాలా పరిపక్వత కల్గిన చిత్రకారుడు గీసినట్లున్నాయి. నీ వయసు పిల్లలు గీసే బొమ్మల్లో సాధారణంగా అంతటి పరిపక్వత ఉండదు. అంతేగాక చాలామందికి బొమ్మ గీశాక తమ సంతకం చేసే అలవాటు ఉంటుంది. మీ నాన్నగారు కూడా పొరపాటున అలా సంతకం చేశారు. నువ్వు కూడా నన్ను ప్రశ్నించినపుడు నా బొమ్మ అన్నావే గాని నేను గీసిన బొమ్మ అనలేకపోయావు. ఈ కారణాలన్నీ నీ తప్పును బహిర్గతం చేశాయి,' అన్నారు.

అందరిముందూ దోషిగా నిలబడాల్సి రావడంతో రాజు సిగ్గుతో తలవంచుకున్నాడు. మాస్టారు అతణ్ణి సముదాయిస్తూ, 'చూడు రాజూ! పోటీతత్వం మనల్ని ముందుకు నడిపించాలే గానీ, ఇలా ప్రథమ స్థానం కోసం అపసవ్యమైన చర్యలకు ప్రేరేపించకూడదు. గిరి కన్నా ముందుండాలన్న తాపత్రయంతో నువ్వు మీ నాన్నగారి చేత బొమ్మ గీయించావు. ఒక విధంగా చూస్తే నువ్వు పరీక్షలో పాల్గొననట్టే,' అని అన్నారు.

తన తప్పు తెలుసుకున్న రాజు అటు పిమ్మట అసూయ వీడి, గిరితో బాటే అందరు పిల్లలతో సఖ్యతగా మెలగసాగాడు.





# అశ్వబలి

గుఱ్ఱాలకు ప్రసిద్ధి చెందిన అరేబియా దేశంలో, పూర్వం గిజ్రూ అనే గ్రామాధికారి ఒకడు ఉండేవాడు. పరిపాలనలో గిజ్రూ చాలా ఖచ్చితమైనవాడు. కాని, ఎంత ఖచ్చితమైన వాడో అంత దయ కలవాడు.

గిజ్రూ, గొప్ప దాత అని దేశ దేశాల కీర్తి వ్యాపించింది. దానం ఇచ్చేటప్పుడు ఎటువంటి త్యాగమైనా చేసే సాహసం కలవాడు. తన నివాస మందిరం వద్దకు ఎవరైనా వచ్చి 'గిజ్రూ, నాకీ వస్తువు కావాలి' అని అడిగితే, లేదు అనే మాట అతని నోట ఎన్నడూ రాలేదు.

ఇంతటి ఉదారుడైన గిజ్రూ వద్ద ఏదో ఒకటి అడిగి పట్టుకుపోవచ్చు కదా అని దూర దేశాలనుంచి కూడా ప్రజలు వచ్చేవారు.

తన ఇంటికి ఎవరు వచ్చినా, గిజ్రూ ఎంతో మర్యాదగా వారిని ఆదరించి అర్ఘ్య పాదాద్యులిచ్చి, పంచభక్ష్య పరమాన్నములతో భోజనం పెట్టి, హాయిగా పడుకునేందుకు హంసతూలికా తల్పాదులు అమర్చేవాడు.

అటువంటి ఏర్పాట్లు చేసిన గిజ్రూ మంచితనానికి మెచ్చుకుని, ఆ వచ్చిన అతిథులు తృప్తి పడేవారు. ఒక వేళ గిజ్రూ వద్ద ఆయాచితంగా ఏదైనా అడిగి పట్టుకోవాలనే దురాశతో వచ్చినప్పటికీ, గిజ్రూ ఇంట ఆతిథ్యం పొందిన తరవాత వారిలో దురాశలు అంతరించి వారి మనసు మంచిగా మారిపోయేది.

ఇటువంటి గిజ్రూకు ఈ లోకంలో అత్యంత ప్రియమైనది ఒక్కటే ఉన్నది. అది

కె.వి. జానకి

ఏమిటంటే, అతను అపురూపంగా పెంచు కుంటున్న అమ్రాక్ అనే గుర్రం. అమ్రాక్ అంటే గిజ్రాకు పంచప్రాణాలు.

ఆ కాలంలో అరేబియా దేశాన్ని ఇబ్రహీం అనే సుల్తాను పరిపాలిస్తూ ఉండేవాడు. ఇబ్రహీం కూడా గిజ్రా అంత మంచివాడే. అయనకు కూడా గుర్రాలంటే చాలా సరదా.

సరదా ఉండటం చేతనే, ఆ దేశంలో ఉండే అందమైన అరబ్బీ గుర్రాలను ఎక్క డెక్కడినుంచి రప్పించి, సుల్తాను తన దివాణపు డేరాలలో అట్టిపెట్టుకున్నాడు.

ఇదిలా ఉండగా, ఒక రోజున ఎవరో వచ్చి, తమ దివాణంలో ఉండే గుర్రాల న్నింటి కంటే గిజ్రావద్ద ఉన్న అమ్రాక్ చాలా అందమైనది, అని సుల్తానుతో చెప్పారు.

ఈ మాట విని సుల్తాను, 'సరే, దీనికే ముంది? గిజ్రాకు కోరినంత ధనమిచ్చి, అమ్రాక్‌ను తీసుకురండి,' అని చెప్పి, ఒంటెలపైన వరహాల సంచులు వేయించి, తన రాయబారుల్ని పంపించాడు.

అయితే, ఎంత ధనమిచ్చినా గిజ్రా తన గుర్రాన్ని వదలలేదు. ఇది పని కాదని తలిచి, రాయబారులు ఒకసారి కంటే మరొకసారి ధనం హెచ్చు చూపిస్తూ, ఏడు సార్లు గిజ్రా వద్దకు వెళ్లారు.

ఎన్నడూ ఎవ్వరికీ ఏది అడిగినా లేదు అనే మాట చెప్పని గిజ్రా, ఈ ఏడు సార్లు కూడా 'దయ ఉంచి నన్ను మన్నించండి.



అమ్రాక్‌ను తప్పించి మరేదైనా అడగండి.' అని వినయంగా చెప్పి వారిని పంపేశాడు.

ఈ సంగతి సుల్తాను విని ఆశ్చర్యపడి, ఇంతగా లోకం పొగడుతున్నటువంటి ఆ అమ్రాక్ సంగతి ఏమిటో చూడాలని తనే మారువేషంతో గిజ్రావద్దకు వచ్చాడు!

సుల్తాను వచ్చి కళ్లారా ఆ గుర్రాన్ని చూచిన తరవాత, అమ్రాక్ పైన అయనకు చెప్పలేని మక్కువ కుదిరిపోయింది. సుల్తాను తన కోటకు వెళ్లిపోయాడు.

కానైతే, 'మహాదాత అని లోకఖ్యాతి పొందిన గిజ్రా నోటి వెంటనే లేదనే మాట వచ్చిందే! అమ్రాక్‌ను నేను సంపాయిం చడం కల్ల' అని సుల్తాను నిరాశతో మంచం పట్టాడు.



క్రమేణా సుల్తాను వ్యాధి ప్రమాదస్థితికి వచ్చింది. అప్పుడు సుల్తాను కొడుకు వజీరును పిలిపించి, 'ఓయి వజీరూ! ఎలా అయినా సరే, మనం అమ్రాక్‌ను వెంటనే సంపాదించుకురావాలి. లేని పక్షంలో నా తండ్రి బెంగతో మరణించేటట్టున్నాడు. ఏమిటి నీ సలహా?' అని అడిగాడు.

అందుకు వజీరు 'అయ్యా! మీరెందుకు అలా భయపడతారు? గిజ్రాకు ఎవరేది అడిగినా లేదు అనకుండా ఇచ్చే వ్రతమున్నది కదా.

ఈ సంగతి ప్రపంచమంతటికీ తెలుసు. అటువంటప్పుడు మనం గుర్రాన్ని అడిగి తీసుకోవటమనేది ఏమంత అసాధ్యమైన పని? నేను చెప్పినట్లు చెయ్యండి.

ఈ కార్యం నిమిత్తం గిజ్రా వద్దకు మీరే స్వయంగా వెళ్ళి, నాన్నగారి పేరు చెప్పి, కనీసం ఒక్క సంవత్సరం పాటు అమ్రాక్‌ను మన దివాణంలో ఉంచాలని కోరండి. మీ కోరిక తప్పకుండా నెరవేరుతుంది.' అని చెప్పాడు.

సుల్తాను కొడుకు తక్షణమే పరివారాన్ని వెంటబెట్టుకుని బయల్దేరి గిజ్రా డేరాకు చేరేవరకు, అక్కడ ఒక గొర్రెల కాపరి తప్ప మరెవ్వరూ లేరు. 'అయ్యా! ఇక్కడ నీళ్లన్నీ ఇంకిపోయినాయండి. కనుక, ఇక్కడికి తూర్పు దిక్కునపదిమైళ్ళ దూరంలో ఉండే చెరువులో మకాం పెట్టారు,' అని చెప్పాడు గొర్రెల కాపరి.

సుల్తాను కొడుకు వెతుక్కుంటూ వెళ్ళి గిజ్రా మకాం చేరుకున్నాడు. గిజ్రా అతనిని ఒక పట్టు పరుపుపైన కూర్చుండబెట్టి, మర్యాదలన్నీ జరిపిన తరవాత భోజనానికి లెమ్మన్నాడు.

ఆ విందులో వడ్డించినపదార్థాలవంటివి సుల్తాను కొడుకు తన జన్మలో ఇంతవరకు ఆరగించి ఎరుగడు.

తరువాత, గిజ్రా సుల్తాను కొడుకు వద్దకు వచ్చి, 'ఈ ఎడారులన్నీ దాటి తమరిక్కడికి ఎందుకు దయచేశారో, నావల్ల కాగల పని ఏమిటో సెలవియ్యండి,' అని అడిగాడు.

అందుకు సుల్తాను కొడుకు, 'మీతో పని ఉండే వచ్చాము. మా తండ్రిగారు

అబ్రమాక్ మీద మక్కువ కలిగి, దానికోసం బెంగపెట్టుకున్నాడు!' అన్నాడు.

'అబ్రమాక్ మీదనా!' అని ఆశ్చర్యంతో అడిగి, గిబ్రజూ తల వంచుకున్నాడు.

'అవును, అబ్రమాక్ కోసం నాయనగారు బెంగపెట్టుకుని మంచం పట్టి ఉన్నారు. ఆయన చాలా ప్రమాదావస్థలో ఉన్నారు,' అన్నాడు సుల్తాను కొడుకు.

గిబ్రజూ బొటబొట కన్నీరు కార్చాడు.

ఇది చూచి సుల్తాను కొడుకు 'గిబ్రజూ ఎందుకలా కంట తడి పెడుతున్నావ్?' అని అడిగాడు.

గిబ్రజూ కంట నీరు తుడుచుకుంటూ, 'తమరు వచ్చే సమయానికి, నా గొర్రెల మందలు దూరాన ఉన్నాయి. అందుచేత విందుకు తగిన పదార్థం తయారుచేయాలనే ఆత్రంతో, నా ప్రాణమైన అబ్రమాక్‌నే వండి వడ్డింపించాను,' అని చెప్పలేక చెప్పలేక చెప్పాడు.

'గిబ్రజూ! మాపట్ల నీకు ఎంతటి భక్తి, గౌరవాలున్నాయో, ఇప్పుడు తెలిసింది. నీ ఔదార్యమూ, త్యాగమూ ఎటువంటిదో ఈనాటికి నేను గ్రహించగలిగాను. తీరా ఇప్పుడు అబ్రమాక్కు బలి అయిపోయింది. ఏమి చేయగలం? కాని, అబ్రమాక్ బలి కావడం వల్ల నీ కీర్తి; నీ అసమాన త్యాగం వల్ల, అబ్రమాక్ కీర్తి శాశ్వతంగా ఈ భూలోకంలో నిలిచిపోగలవు' అని చెప్పి సుల్తాను కొడుకు గిబ్రజూను ఊరడించాడు.

ఈ సమాచారమంతా తెలిసి సుల్తాను ఒళ్లు నిమ్మళించింది. తరవాత, గిబ్రజూ ఏ స్థలంలోనైతే అబ్రమాక్‌ను బలిచేసి తన కుమారుడికి విందు చేశాడో, ఆ ప్రదేశంలో అబ్రమాక్ జ్ఞాపకార్థం లోహంతో తయారైన ఒక ఎత్తైన గుర్రపు విగ్రహాన్ని స్థాపించాడు. ఆ విగ్రహం చూచినప్పుడల్లా ప్రతివారికీ గిబ్రజూ చేసిన లెక్కలేని త్యాగాలు జ్ఞాపకానికి వస్తూంటాయి.





# చెప్పుడుమాటలు

మణిపురాన్ని చంద్రవర్మ అనే రాజు పాలించేవాడు. ప్రజలను కన్నబిడ్డల్లా చూసుకోవడంలో, ఆయనకు ఆయనే సాటి. ఎంతటి ధర్మప్రభువో, అంతటి వీరుడు కూడా. అయితే, చంద్రుడికి మచ్చలా చంద్రవర్మలో ఒకలోపం ఉండేది. ఆయన చెప్పుడు మాటల్ని గుడ్డిగా నమ్మేసేవాడు. పొగడ్తలకు ఇట్టే లొంగిపోయేవాడు.

ఈ బలహీనతని ఆసరాగా చేసుకుని, కొందరు ఆయన చుట్టూ చేరి, తమకు గిట్టని వారిమీద ఏవేవో పితూరీలు కల్పించి చెప్పసాగారు. రాజు వాటిని గుడ్డిగా నమ్మి ఏ మాత్రం ముందువెనుకలు ఆలోచించకుండా, వాళ్లను కఠినంగా శిక్షించేవాడు. అలా చెప్పుడు మాటలకు ఎందరో అమాయకులు బలయ్యారు. దానితో ప్రజల్లో చంద్రవర్మపై గల గౌరవం తగ్గి, క్రమంగా అసంతృప్తి చోటు చేసుకోసాగింది.

ఒక రోజు, ఆస్థాన జ్యోతిష్కుడైన శ్రీనందుడు రాజభవనం పక్కగా వెళ్తూండగా, భుజం మీద పెద్ద పనసపండు ఒకదాన్ని పెట్టుకుని ఎదురుగా వస్తున్న ఒక మనిషి కనిపించాడు.

శ్రీనందుడు, అతణ్ణి ఆపి 'ఏమయ్యా, చాలా పెద్ద పనసపండులా ఉందే! బాగా పండినట్టుగా కూడా ఉంది. ఎవరికోసం తీసుకుపోతున్నావేమిటి?' అని ప్రశ్నించాడు.

శ్రీనందుడెవరో, ఆ మనిషి ఎరగడు. అతడు శ్రీనందుడితో, 'బాబూ, ఇది నా తోటలో కాసిన తొలి పండు! రాజు దేవుడితో సమానమంటారు గదా. నా తోటలోని తొలి

లక్ష్మీ మనోజ్ఞ

పండును ఆయనకే సమర్పించుకుందామని వెళ్తున్నాను,' అన్నాడు.

'అలాగా, మంచిది! అయితే, ఇంతకూ నిన్నెందుకు ఆపానో చెప్పనే లేదు. ఎదురుగా వస్తున్న నీ ముఖంలోకి పరీక్షగా చూశాను. ఈ దేశానికి రాజు కాగలిగిన లక్షణాలన్నీ నీలో పుష్కలంగా ఉన్నట్టు గమనించాను. ఏదో ఒకనాడు నువ్వీ దేశానికి రాజువు కాగలవని, నా నమ్మకం. ఆ విషయం చెప్పాలనే, నిన్ను ఆపాను. మరి వస్తా!' అంటూ శ్రీనందుడు ముందుకు నడిచాడు.

ఈ మాటలు రాజభవనంపై చల్లగాలి కోసం పచార్లు చేస్తున్న రాజు చంద్రవర్మ చెవిలో పడ్డాయి. శ్రీనందుడు చెప్పింది విని, ఆయనకెంతో ఆశ్చర్యం కలిగింది. అదీ ఒక గొప్ప జ్యోతిష్కుడే ఈ మాట చెప్పాడంటే, అందులో కొంత నిజం లేకపోలేదనిపించి, ఆయన ఏం జరుగుతుందో చూడాలన్న ఉత్సాహంతో చాటుగా ఉండి గమనించసాగాడు.

శ్రీనందుడి మాటలు వినగానే, సహజంగానే రైతు కళ్లు మెరిశాయి. వెంటనే అతను వెళ్లిపోతున్న శ్రీనందుడి వెంటపడి ఆపి, 'అయ్యా, నన్నుగురించి ఇలా ఎందుకనుకున్నారో, కాస్త వివరంగా చెప్పండి,' అని కోరాడు.

'చెప్పడానికి అభ్యంతరం ఏమీ లేదు. కాని ఉచితంగా నేనెందుకు చెప్పాలి?' అని అడిగాడు శ్రీనందుడు.

తనలో రాజు కాదగినంత గొప్ప లక్షణమేమిటో, తెలుసుకోవాలన్న ఆత్రుతలో



ఉన్న రైతు తను రాజదర్శనానికి బయలు దేరిన విషయం పూర్తిగా మరిచిపోయి, తన దగ్గిరున్న పనసపండును శ్రీనందుడి చేతిలో పెడుతూ, 'అయ్యా, నేను చాలా పేదవాణ్ణి, ఈ పండు తప్ప ప్రస్తుతం నా దగ్గిర చిల్లి గవ్వ కూడా లేదు. ఈ చిన్న కానుకను స్వీకరించి, ఇకనైనా చెప్పండి! నాలో తమకు కనిపించిన అంత గొప్ప రాజ లక్షణాలేమిటి? తమరు చెబితే వినాలని తహతహలాడిపోతున్నాను,' అన్నాడు ప్రాధేయపడుతూ.

ఇందుకు శ్రీనందుడు చిన్నగా నవ్వి, 'నేనెవరో నీకు తెలుసా?' అని అడిగాడు.

'ఊహు, తెలియదు. తమర్ని ఏనాడూ చూసిన గుర్తు కూడా లేదు,' అన్నాడు రైతు.

'అదీ సంగతి! ఇప్పటివరకూ నేనెవర్నో కూడా నీకు తెలియదు.అయినా దారే పోయే నేను, నిన్ను చూసి ఏదో కల్పించి నాలుగు పొగడ్త మాటలనేసరికి గుడ్డిగా నమ్మేశావు. ఒక పేదరైతును నేను రాజు కావడమేమిటి? ఇది సాధ్యమయ్యే పనా? అని ఆలోచించకుండా, రాజుగారి కోసం తీసుకుపోతున్న కానుకను, నాకిచ్చేశావు. దీన్ని బట్టి నువ్వెంత అమాయకుడివో, తెలిసిపోతున్నది. ఎవరేది చెప్పినా వెంటనే నమ్మేసే, నీలాంటి గొప్ప అమాయకుడు, ఈ రాజ్యంలో ఇంకొకడు ఉండే అవకాశం లేదు. ఈ దేశానికి రాజు కావడానికి, ఇంత కంటే ప్రధాన లక్షణం మరేం కావాలి? ప్రయత్నించి చూడు, రాజువు కాగలవు!' అంటూ శ్రీనందుడు ముందుకు సాగాడు.

ఇదంతా విన్న రాజు చంద్రవర్మ కళ్లు తెరచుకున్నాయి.తనకు తగిన పాఠం చెప్పడానికే, శ్రీనందుడిలా ప్రవర్తించాడని ఆయన గ్రహించాడు.

ఆ తర్వాత శ్రీనందుడాశించిన విధంగానే చంద్రవర్మ ప్రవర్తనలో పూర్తిగా మార్పు వచ్చింది.



# కెరీర్ అంటే?

ప్రియమిత్రులారా!

నేను అత్యంత ఆసక్తి కలిగించే వార్తలను మీకు అందించబోతున్నాను. మా అత్తయ్య ఒకరు మా జిల్లా కలెక్టర్‌గా పనిచేస్తున్నట్లు నాకిప్పుడే తెలిసింది. ఆమె ఐఎఎస్ అధికారి. భగవంతుడా! ఆమె మావద్దకు కారులో వచ్చింది. కారు బ్యానెట్‌పై ఎర్రలైటు ఉంది. యూనిఫాం ధరించిన వ్యక్తి ఆమె అంగరక్షకుడుగా ఉన్నాడు. నిజంగా మంచి వార్తే కదూ! కాబట్టి సివిల్ సర్వీసులకు చెందిన సమస్త సమాచారాన్ని నేను కనుగొనాలనుకున్నాను. ఐఎఎస్ ఒక్కటే కాకుండా అన్ని ఎంపికలూ అందుబాటులో ఉన్నాయని ఆమె చెప్పింది. సివిల్ సర్వీసులో ఉన్న వివిధ రంగాలను ఆమె నాకు తెలియపర్చింది.

ఈ సమాచారాన్ని మీకు తెలియనివ్వండి.

సివిల్ సర్వీసులు కీలకమైన సేవలలో ఒకటిగా గుర్తించబడుతోంది. ఉన్నతమైన ప్రతిభ, ఆకాంక్ష కలిగిన వారికి ఇది సవాలు గొల్పే చక్కటి అవకాశాన్ని కల్పిస్తుంది. భారతదేశంలో ని ఏ ఇతర సర్వీసులో లేనంత అధికారాన్ని అందజేస్తున్న ఈ రంగంలో పలురకాల ఉద్యోగాలు ఉంటున్నాయి. సివిల్ సర్వీసులలో ఉన్న వివిధ విభాగాలు...




ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీస్ (ఐ.ఎ.ఎస్): ఐ.ఎ.ఎస్ ఉద్యోగులు రాష్ట్ర లేదా కేంద్ర ప్రభుత్వాలకు సేవ చేస్తారు. దేశ పాలనలో వారికి సహాయపడతారు. ఈ సర్వీస్‌లో చేరినవారు జిల్లా కలెక్టర్, శాఖాధిపతులు, రాష్ట్ర స్థాయిలో ప్రభుత్వ సంస్థల అధిపతులు వంటి పలు ప్రభుత్వ పదవులను చేపడతారు. వీరు డెప్యుటేషన్ ప్రాతిపదికన కేంద్ర ప్రభుత్వ పదవులలో కూడా నియమించబడతారు.

ఇండియన్ పోలీస్ సర్వీస్ (ఐ.పి.ఎస్): ఇది దేశంలో యూనిఫాంలో ఉండే కీలకమైన సివిల్ సర్వీసు. ఐ.పి.ఎస్ అధికారి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండింటిలో పనిచేస్తారు. అతడు/ఆమె రాష్ట్ర ప్రభుత్వంలో వివిధ స్థాయిలలో సేవలందిస్తారు. ఉద్యోగ ప్రారంభ జీవితంలో ఎ.ఎస్.పి నుంచి పదవీవిరమణ సమయంలో డీజీపీ -డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు- వరకు (ఇతడు రాష్ట్రంలో పోలీసు బలగాల అధిపతి) పలు పదవులను చేపడతారు. అతడు/ఆమె కేంద్ర రిజర్వ్ పోలీసు బలగం, సరిహద్దు భద్రతా బలగం, రీసెర్చ్ మరియు అనాలిసిస్ వింగ్ (రా) ఇంటెలిజెన్స్ బ్యూరో, కేంద్ర నేరపరిశోధనా మండలి వంటి పలు సంస్థలలో సేవలందిస్తారు. *(ఇంకాఉంది)*



# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 28

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -28 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. జూన్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. ఆగస్ట్ 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## ప్రపంచ ద్రవ్యం, నాణేలు!



1. స్విట్జర్లండ్ ద్రవ్యం ఏది?
2. ఫ్రాన్స్, జర్మనీ, గ్రీస్, ఆస్ట్రియా వంటి దేశాల ఉమ్మడి కరెన్సీ ఏది?
3. ప్రపంచంలో చాలా ఎక్కువగా వ్యాపారం సాగే కరెన్సీ ఏది?
4. తన నాణేన్ని పాండా చిహ్నం తో "1 ozAg.999" గా ముద్రించిన దేశమేది?
5. కెనడా అధికారిక బంగారు నాణెం ఏది?
6. హోలోగ్రామ్ నాణేలను కలిగి ఉన్న దేశం పేరేమిటి?
7. నాణేలను సేకరించే అలవాటును ఏమని పిలుస్తారు?

## చందమామ లోకజ్ఞానం క్విజ్-25 ఫిబ్రవరి 2011 సమాధానాలు

1. ఎమిలీ బెర్లినర్ - మార్చ్ 4, 1877, 2. వరల్డ్ వైడ్ వెబ్, 3. హోండా, 4. సూర్యుడు, 5. నిజం, 6. పాదవు

*February'11 Winners: 1. Sudeep Bhalchandra Kulkarni, Raigad - 410206.
2. Yadnesh Chaphalkar, Nashik - 422006.*



# నవ్వుల పువ్వులు



గిరీష్: ఆ చిన్న పతకం నీకు ఎందుకిచ్చారు?
హరీష్:పాట పాడినందుకు.
గిరీష్:మరి ఆ పెద్ద పతకం ఎందుకిచ్చినట్టో?
హరీష్:నేను పాటలు పాడటం ఆపివేసినందుకు.



వినయ్:అమ్మా, 'నీతో పాటు బడికివస్తున్న తమ్ముళ్లు, చెల్లెళ్లు గాని ఉన్నారా' అని ఈ రోజు మా టీచర్ నన్నడిగింది.
అమ్మ: నీపట్ల ఆమె అంత శ్రద్ధ చూపటం బాగుంది. ఇంట్లో నేనొకణ్ణే పిల్లాడినని నీవన్నప్పుడు ఆమె ఏమన్నది?
వినయ్: టీచర్ ఈ ఒక్క మాట మాత్రమే అన్నది.
''బతికించావు దేవుడా!''



అత్తయ్య: రాజీ, నీవద్ద పది ఆపిల్ పళ్లున్నాయి, నీ పక్కనే ఉన్న అమ్మాయి 5 ఆపిల్స్ తీసుకుంది. అప్పుడు నీ వద్ద ఏం మిగిలి ఉంటాయి.
రాజీ:కొట్లాట మాత్రమే మిగిలి ఉంటుంది మరి!



టీచర్: శ్యామ్! నీ వేళ్లపై ఏం రాస్తున్నావు?
శ్యామ్: చరిత్ర గురించిన తేదీలు.
టీచర్: ఎందుకు?
శ్యామ్: చరిత్ర గురించిన ముఖ్యమైన తేదీలను వేలి కొసలపై ఉంచుకుని నిత్యం గుర్తుంచుకోవాలని మా చరిత్ర ఉపాధ్యాయుడు చెప్పారండీ.

# సుడోకు పజిల్

కింది సుడోకు పజిల్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి.

పరిష్కారానికి సూచనలు: ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్‌కు పరిష్కారం ఆగస్ట్ 2011 సంచికలో ప్రచురించబడుతుంది. సరైన సమాధానాలు పంపిన విజేతల్లో ఒక్కో భాషలో ఒక్కొక్కరికి ₹500/- బహుమతి ఉంటుంది.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | 7 | | 1 | 3 | |
| 2 | 5 | | | | 4 | | | |
| | | | | | | | 5 | |
| | 6 | 9 | | | | | | |
| | | | 9 | | | 5 | | 8 |
| | 1 | 5 | | 3 | | | | |
| | | | | | 8 | | | 6 |
| | 3 | | | 5 | | | 7 | |
| 9 | | | 2 | | | | | |

మీ ఎంట్రీలను 2011 జూన్ 25లోగా పంపించండి. మా చిరునామా:

**SUDOKU PUZZLE,**
**CHANDAMAMA INDIA LTD.,**
Swathi Enclave Nos. 5 & 6,
Amman Koil Street, Vadapalani,
Chennai-600026.
e-mail your entries to:
contests@chandamama.com

ఫిబ్రవరి'11 సుడోకు పజిల్స్‌కు సరైన పరిష్కారం:

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 8 | 1 | 7 | 9 | 2 | 3 | 4 | 5 | 6 |
| 6 | 9 | 5 | 4 | 8 | 1 | 3 | 7 | 2 |
| 3 | 2 | 4 | 7 | 6 | 5 | 8 | 9 | 1 |
| 5 | 3 | 8 | 2 | 7 | 4 | 6 | 1 | 9 |
| 2 | 6 | 1 | 8 | 3 | 9 | 5 | 4 | 7 |
| 7 | 4 | 9 | 1 | 5 | 6 | 2 | 3 | 8 |
| 4 | 8 | 2 | 5 | 1 | 7 | 9 | 6 | 3 |
| 1 | 5 | 6 | 3 | 9 | 8 | 7 | 2 | 4 |
| 9 | 7 | 3 | 6 | 4 | 2 | 1 | 8 | 5 |

**Feb'11 Winners**

1. Sarth Vikram Joshi, Thane - 400 607.
2. V. Vani, Nellore - 524 004.
3. A.V. Nisheetha, Chennai - 600 041.
4. K. Rajalaxmi, Bangalore - 560 076.
5. Khaeswar Nazk, Rowkela - 769 006.

## మీకు తెలుసా?



ప్రాచీన ఈజిప్టులో, వర్తకులు దేశాన్ని వదిలిపెట్టి వ్యాపార యాత్రలు చేస్తున్నప్పుడు, తమ వెంట చిన్న పరిమాణంలో తమ రూపంతో కూడిన రాతి నమూనాలను వెంటబెట్టుకుని వెళ్లేవారు. పరదేశంలోనే వీరు మరణించినట్లయితే, అంత్యక్రియలకోసం వీరి ఈ నమూనాలనే ఈజిప్టుకు పంపేవారట.

# సాహస డైవర్

కనురెప్పపాటులో నీటిలో తేలడం మునగడం!

## ఏమేం కావాలి?






- హెక్స్ సైకిల్ నట్, రబ్బర్ బాండ్, ప్లాస్టిక్ డ్రాపర్, పూర్తిగా నీటితో నింపిన 2 లీటర్ల పారదర్శక ప్లాస్టిక్ బాటిల్.




## తయారు చేయడం ఎలా?

- సైకిల్ నట్‌ని ప్లాస్టిక్ డ్రాపర్‌లో ఉంచి రబ్బర్ బాండ్‌తో దాన్ని భద్రంగా ఉంచండి.
- డ్రాపర్‌లో తగినంతనీటిని నింపండి. అప్పుడు అది ఫ్లష్‌ని నీటి మట్టంలో తేలేలా చేస్తుంది. ఈ సంక్లిష్టమైన సమతుల్యత కలిగిన డ్రాపర్ నీటిలో తేలదు లేదా మునగదు.
- ఈ డ్రాపర్‌ని 2 లీటర్ల నీటి సీసాలో ఉంచండి. సీసా మూతను గట్టిగా బిగించండి. డ్రాపర్ నీటిలో తేలియాడుతుంది.
- ఇప్పుడు సీసాని చేత్తో నొక్కితే డ్రాపర్ నీటి అడుగు భాగంలోకి డైవ్ చేస్తుంది.







**కాన్సెప్ట్:** సీసాను నొక్కడం ద్వారా, కాసిన్ని నీళ్లు సంక్లిష్టంగా సమతుల్యతతో ఉన్న డ్రాపర్ బరువు పెరిగేలా చేస్తాయి. దీంతో డ్రాపర్ మునుగుతుంది. చేతిని సడలించి సీసాపై వత్తిడిని తొలగిస్తే అదనపు నీరు బయటకు వచ్చి డ్రాపర్ పైకి తేలుతుంది!

*రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)*

# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.

| English | Where is your house? | My house is also in Jayanagar. |
|---|---|---|
| Telugu | మీ ఇల్లు ఎక్కడ ఉంది? | మా ఇల్లు కూడా జయనగర్‌లోనే ఉంది. |
| Hindi | तुम्हारा घर कहाँ है?<br>తుమ్హారా ఘర్ కహాఁ హై? | मेरा घर भी जयनगर में है।<br>మెరా ఘర్ భీ జయనగర్ మే హై. |
| Tamil | உன் வீடு எங்கே?<br>ఉన్ వీడు ఎంగే? | என்னுடைய வீடும் ஜெயநகரில் இருக்கிறது.<br>ఎన్నుడియ వీడుమ్ జయనగరిల్ ఇరుక్కిరదు. |
| Bengali | আপনার বাড়ি কোথায়?<br>ఆప్‌నార్ బాడి కొతాయ్ | আমার বাড়িও জয়নগরে<br>ఆమార్ బాడి జయనగరే |
| Marathi | तुझं घर कुठे आहे?<br>తుజ్ ఘర్ కుఠె ఆహె? | माझं घरसुद्धा जयनगरमध्ये आहे.<br>మాజ్ ఘర్‌సుద్ధా జయనగరమధె ఆహె. |
| Kannada | ನಿಮ್ಮ ಮನೆ ಎಲ್ಲಿದೆ?<br>నిమ్మ మనె ఎల్లిదె? | ನನ್ನ ಮನೆಯೂ ಜಯನಗರದಲ್ಲೇ ಇದೆ.<br>నన్న మనెయో జయనగరదల్లీ ఇదె. |
| Oriya | ଆପଣଙ୍କର ଘର କେଉଁଠାରେ?<br>అపనాకర్ ఘరా క్యూన్ థారె. | ମୋର ଘର ମଧ୍ୟ ଜୟନଗରରେ।<br>మోరా ఘరా మధ్య జయనగరే. |
| Gujarati | તમારું ઘર ક્યાં છે?<br>తమారు ఘర్ క్యా ఛె? | મારું ઘર પણ જયનગરમાં છે.<br>మారు ఘర్ పణా జయనగరమన్ ఛె? |
| Assamese | আপোনাৰ ঘৰ ক'ত?<br>అపోనార్ గోర్ కొటె? | মোৰ ঘৰটো জয়ানগৰত।<br>మోరె ఘోర్టో జయనగరత్ |
| Malayalam | നിങ്ങളുടെ വീടെവിടെയാണ്?<br>నింగలుడె వీడెవిడెయను? | എന്റെ വീടും ജയനഗറിലാണ്<br>ఎంటే వీడుమ్ జయనగరిలను |
| Santali | ᱟᱵᱤᱱᱟᱜ ᱚᱲᱟᱜ ᱫᱚ ᱚᱠᱟᱨᱮ?<br>అబినగ్ ఒడగ్ దొ ఒకరే? | ᱟᱞᱤᱠᱟᱜ ᱚᱲᱟᱜ ᱦᱚᱸ ᱡᱚᱭᱱᱚᱜᱚᱨ ᱨᱮᱜᱟ।<br>అలికాగ్ ఒడగ్ హాఁన్ జయనగర్ రగ. |
| Sanskrit | तव गृहं कुत्र अस्ति?<br>తవ గృహమ్ కుత్ర అస్తి | मम गृहम् अपि जयनगरे अस्ति।<br>మమ గృహమ్ అపి జయనగరె అస్తి. |





| English | Where in Jayanagar ? | In the lane beside the court-building. |
|---|---|---|
| Telugu | జయనగర్‌లో ఎక్కడ ఉంది? | కోర్టు భవనం పక్క సందులో ఉంది. |
| Hindi | जयनगर में कहाँ?<br>జయనగర్ మె కహాం? | कोर्ट की इमारत के बगल की गली में।<br>కోర్ట్ కే ఇమారత్ కె బాగల్ కీ గాలే మె. |
| Tamil | ஜெயநகரில் எங்கே?<br>జయనగరిల్ ఎంగే? | நீதிமன்றம் அருகில் உள்ள தெருவில்<br>నీతిమందమ్ అరుగిల్ ఉల్ల తెరువిల్ |
| Bengali | জয়নগরে কোথায়?<br>జయనగరె కొథాయ్? | আদালত ভবনের পাশের গলিতে।<br>అదాలత్ భవనెర్ పాషెర్ గొలితే. |
| Marathi | जयनगरमध्ये कुठे?<br>జయనగర్‌మధె కుఠె? | न्यायालयाच्या इमारतीच्या बाजूच्या गल्लीत.<br>న్యాయాలయచయ ఇమరటిచ్య బజూచ్యా గల్లిట్. |
| Kannada | ಜಯನಗರದಲ್ಲಿ ಎಲ್ಲಿ?<br>జయనగరదల్లి ఎల్లి? | ಕೋರ್ಟ್ ಕಟ್ಟಡದ ಪಕ್ಕದಲ್ಲಿರುವ ಓಣಿಯಲ್ಲಿದೆ.<br>కోర్ట్ కట్టడద పక్కదల్లిరువ ఒణియల్లిదె. |
| Oriya | ଜୟପୁରରେ କେଉଁଠାରେ?<br>జయపురారె క్యూన్‌థారె? | ବିଚାରାଳୟ କୋଠା ରହିଥିବା ଗଳିର ନିକଟରେ।<br>బిచారాలయ కో థా రాహిథిబా గలిరా నికాతెరె. |
| Gujarati | જયનગરમાં ક્યાં?<br>జయనగరమాన్ క్యాన్? | અદાલત-ભવનની બાજુની ગલીમાં.<br>అదాలత్-భవనానె బాజునే గలీమా. |
| Assamese | জয়ানগৰৰ ক'ত?<br>జయనగరార్ కొటె? | কাছাৰীৰ কাষেদি যোৱা ৰাস্তাটোতে।<br>కసిరర్ కాఖెడి జోవా రాస్తాటోటె. |
| Malayalam | ജയനഗറിൽ എവിടെയാണ്?<br>జయనగరిల్ ఎవిడెయను? | കോടതികെട്ടിടത്തിന്റെ അടുത്തുള്ള റോഡിൽ<br>కొదాటి కెట్టిడాథిన్టె అదుత్తుల్లా రోడిల్ |
| Santali | ᱡᱚᱭᱚᱱᱚᱜᱚᱨ ᱫᱚ ᱚᱠᱟᱨᱮ?<br>జయనగర్ దొ ఒకరె? | ᱠᱩᱴ ᱫᱚᱞᱟᱱ ᱥᱩᱨ ᱠᱩᱞᱤᱨᱮ।<br>కూట్ దోలన్ సుర్ కుల్లిరే. |
| Sanskrit | जयनगरे कुत्र?<br>జయనగరే కుత్ర? | न्यायालयभवनस्य पार्श्वस्थे उपमार्गे एव।<br>న్యాయాలయ భవనాస్య పార్శ్వస్థే ఉపమార్గె ఎవ. |

## ఇంగ్లీష్ దేవతకు ఆలయం



మన దేశంలో కొత్తగా దేవాలయం నిర్మిస్తున్నారంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. కాని ఆ ఆలయంలో ఉంటున్నది ఇంగ్లీషు దేవత అని వింటే ఆశ్చర్యచకితులవడం ఖాయం. ఉత్తర ప్రదేశ్ ఖెరిజిల్లా, లఖింపూర్‌లోని బంకావన్ గ్రామంలో ఈ విచిత్ర గుడిని కడుతున్నారు. అయితే ఇది స్థానికుల చేత స్థానికుల కోసం కడుతున్న దేవాలయం కావడం విశేషం. ఇంగ్లీషు భాషా జ్ఞానం మెరుగుపర్చుకోవడానికి ఈ ఆలయం నిర్మిస్తున్నారు. ఒకే అంతస్తులో నల్లరాతితో నిర్మిస్తున్న ఈ గుడిలో మూడడుగుల దేవతా విగ్రహాన్ని ప్రతిష్టిస్తున్నారు. కలాన్ని, ఇంగ్లీష్ రాజ్యాంగాన్ని చేత్తో పట్టుకుని కంప్యూటర్ రూపంలో ఈ దేవత ఉంది. ఇది గౌను, టోపీని కూడా ధరించి ఉండటం విశేషం.

ఈ ఆలయాన్ని మెకాలే జయంతి సందర్భంగా గత సంవత్సరం అక్టోబర్ 25నే ప్రారంభించి ఉండవలసింది. అయితే ఎందుకో అప్పుడు వాయిదాపడింది. ఈ సంవత్సరం చివరలో ఆలయాన్ని ప్రారంభించనున్నారు.

## మధువన్ మహిళలకు నిషిద్ధం

తమిళనాడుకు చెందిన మధువన్ మహిళలు తమ సోదరులతో, మధువనేతర జాతులతో సంబంధ బాంధవ్యాలు నెరపడం నిషిద్ధం.

పురాణం ప్రకారం, మధువన్‌లు మధురై రాజవంశం పట్ల భక్తివిశ్వాసాలతో వ్యవహరించేవారు. కొంతమంది రాజకుటుంబీకులు ట్రావెన్‌కోర్‌కి వలసపోయి కాలక్రమంలో పూంజార్ రాజవంశం స్థాపించారు. వీరు కేరళకు వెళుతున్నప్పుడు తమ దేవత అయిన మదుర మీనాక్షి విగ్రహాలను తమ వెంట పెట్టుకుని వెళ్లారు. తన వీపున విగ్రహాలను ధరించి వెళ్లిన తెగనే క్రమంగా మధువన్ అని పిలవసాగారు.



మధువన్ మహిళలు వెదురు గుడిసెలలో నివసిస్తారు. తమ తెగకు చెందని పురుషులతో మాట్లాడటానికి వీరిని అనుమతించరు. కొంత కాలం గడిచిన తర్వాత ఈ తెగలోని సోదరులను కూడా ఇంటిలో ఉండడానికి అనుమతించరు. అబ్బాయిలు ఇంట్లో భోజనం చేయవచ్చు గాని, వేరుగా నివసించవలసి ఉంటుంది. ఇక బయటి ప్రపంచంతో మధువన్‌లు కలిసే ప్రశ్నే లేదు.

# గుడ్డివారు కానిదెవరు?



అక్బర్ దర్బారులో గుడ్డితనంపై చర్చ జరుగుతోంది. బీర్బల్ చెప్పాడు. షెహన్‌షా, ఈ విషయంలో, ప్రపంచంలో అనేకమంది ప్రజలు గుడ్డివాళ్లే!.



అక్బర్ చక్రవర్తికి ఈ వ్యాఖ్య నచ్చలేదు. 'ఈ విషయం రుజువు చేస్తావా' అని బీర్బల్‌ని అడిగాడు. 'తప్పకుండా జహాపనా' అంగీక రించాడు బీర్బల్.



మరునాడు అక్బర్ వాహ్యాళి కెళుతూ బీర్బల్ ఒక కుర్చీని అల్లుతుండటం గమనించాడు. 'బీర్బల్, ఏం చేస్తున్నావు?', బీర్బల్ సమా ధానం ఇవ్వలేదు.



కాగితం ముక్కపై అక్బర్ పేరును 'గుడ్డివాళ్లు' అనే జాబితాలో రాశాడు బీర్బల్. చాలామంది ఇదే ప్రశ్న వేయడంతో బీర్బల్ వారి పేర్లను కూడా ఈ జాబితాలోనే చేర్చాడు.



తర్వాత ఒక వృద్ధుడు ఆ దారి వెంబడే వచ్చాడు. 'బిడ్డా, నా కుర్చీ కూడా అల్లుతావా?' అన్నాడు. బీర్బల్ అతడి పేరును 'గుడ్డివాళ్లు కానివారు' అనే జాబితాలో చేర్చాడు.



చక్రవర్తి వాహ్యాళి ముగించుకుని మళ్లీ ఆ దారి వెంట వచ్చినప్పుడు బీర్బల్ లేచి నుంచుని అతడికి రెండు జాబితాలూ చూపించాడు.




తనపేరు గుడ్డివాళ్లు అనే జాబితాలో ఉండటం చూసి అక్బర్ ఆగ్రహోదగ్రుడయ్యాడు. 'నన్ను గుడ్డి వాడంటావా, ఎంత సాహసం? ఈ జాబితా ఇంత పొడవుగా ఎందుకుంది?'




'నేను కుర్చీ అల్లుతుంటే మీరు చూశారు. అయినా ఏం చేస్తున్నావని నన్ను అడిగారు. ఒకే ఒక్క వృద్ధుడు తప్ప అందరూ అలాగే అడిగారు. కాబట్టి అతడొక్కడే గుడ్డివాడు కాడు.'




బీర్బల్ ఉద్దేశం ఏమిటో అక్బర్‌కు అప్పుడు వెలిగింది. 'బీర్బల్ నీవు నిజంగా గొప్పవాడివి! నువ్వు ఎవ్వరినయినా.. చివరకు చక్రవర్తినయినా సరే బోల్తా కొట్టించేస్తావు!'

# హాస్య చిత్రం









# వివిధ వృత్తులు

ఈ నెల నిధిపెట్టెలో మనం వివిధ వృత్తులను రూపొందిద్దాం రండి.


















CHANDAMAMA (Telugu) May 2011 Registrar of Newspapers of India No. MAHTEL/2010/35912
Licensed to post regd. No. MH/MR/N/126/MBI/10-12